# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౦] సెప్టెంబరు 1951 [సంచిక ౬




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందియవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుడుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

మాడర్న్ థియేటర్స్‌వారి

# సర్వాధికారి




డైరెక్షన్
**T.R. సుందరం**

## త్వరలో వచ్చుచున్నది

BAKTHA..

# విషయసూచిక


ప్రధాన వ్యాసము : స్వామీ సీతారాం 487

అయోమయం : అడ్డేపల్లి లక్ష్మీగారు 489

చందమామ : చదలవాడ నాగరత్నముగారు 493

స్త్రీ ! : స్థానం మృత్యుకుమార్ గారు 494

పురుషులకు పెళ్లి ఎందుకో ? : కె. వి. రమగారు 495

మన మర్యాదలు ! : కె. సభాగారు 498

దేశమా - భర్తయా : వీరంరాజు
వెంకట రమణాదేవిగారు 499

మామిడి : వాశిరెడ్డి సుశీలాదేవిగారు 503

ఆడబ్రతుకు : తూములూరి కృష్ణవేణిగారు 505

నైపుణ్యంగల వృత్తులలో సోవియట్ స్త్రీలు :
ఎన్నా ఓలిట్ గారు 509

స్వర్గీయ శ్రీ రుక్మిణి లక్ష్మీపతి : కనకమ్మ,
లక్ష్మీబాయమ్మగార్లు 511

తెలిసీ తెలియని వైద్యాలు : వినతగారు 514

సౌందర్యము : వాశిరెడ్డి సుశీలాదేవిగారు 516

పాకకళ: వాడ్రేవు సీతమ్మగారు 518

చిత్రాంగి : ఎ. వి. ఇ. యల్. సత్యనారాయణ
రావుగారు 519

రాసలీల : ఎం. ఎస్. సీతాదేవిగారు 523

ఆదర్శమిథునం : చీమలపాటి సూర్యనారా
యణరావుగారు 524

బాలవినోదం : "సిసి" 526

గృహవైద్యము : 527

మిత్రస్మృతి : కె. చంద్రమతిగారు 528

సినిమారంగము 529

పేదయిల్లాలు : మనోరమాదేవిగారు 537

స్వాతంత్ర్య దినోత్సవము : సి. సి. పున్నయ్యగారు 538

లోకవార్తలు 539

"భారతనీతి" : మిస్. లలితారావ్ గారు 530

పుష్పచయము 532

స్వీకారము 523

విజ్ఞప్తి : 546

సంపాదకీయములు 547

పంచాంగం 548




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# స్వామీ సీతారాం

ఆంధ్రరాష్ట్ర ఉద్యమం యీనాటిదికాదు. రాష్ట్ర నిర్మాణమును గురించి యీ వరకు అనేక సమావేశాలలో అనేక తీర్మానాలు చేయబడినవి. కాని రాష్ట్ర నిర్మాణం మాత్రం యీనాటి కింతవరకు జరుగలేదు. అందుకు కారణం ఏమిటి? అనే ప్రశ్నను ప్రతి ఆంధ్రుడు పరిశీలించుకొనవలసి యున్నది.

సమర్థమైన నాయకత్వము లేక కాదు; రాష్ట్ర నిర్మాణము విషయంలో ప్రజలలో ఏకీభావము లేక కాదు; రాష్ట్ర నిర్మాణమున కవసరమగు వసతులు, వాతావరణము లోపించికాదు. అయితే మరేమంటారు? అని అడుగవచ్చు. అందుకు జబాబు ఆంధ్ర ప్రజానీకమునకు నిర్మాణాత్మకమైన దీక్ష, కృషి లోపించడమే.

శ్రీ స్వామీ సీతారాం ఆంధ్రరాష్ట్ర ఉద్యమ నాయకులలో నొకరు. కాని వారికీనాడు స్వార్థముకాదు నిరాహార దీక్షకు పురికొల్పింది. ఎంతోకాలమునుండి నడిపిన

ఆంధ్ర రాష్ట్రోద్యమము యీనాడు స్వాతంత్ర్య సిద్ధి తర్వాతకూడ యింతనీరసంగా నుండటం మూలంగా ఏర్పడిన ఆవేదనే తనదీక్షకు కారణం.

స్వామిగారి ఆంధ్రానంద యాత్ర జయప్రదంగా ముగిసింది. నీరసావస్థలోనున్న రాష్ట్రోద్యమానికి నూతనంగా తన యాత్రమూలంగా జీవంపోశారు. వయోవృద్ధుడై కూడ ఓపికతో ఊరూరుతిరిగి ఉద్యమ ప్రచారముచేస్తూ వివిధ ప్రాంత్యాలలో ప్రజల చేత తీర్మానాలు చేయించి రాష్ట్రకాంక్షను ప్రభుత్వానికీ అన్యరాష్ట్రాలకు తెలియ జేశారు.

ఆంధ్రప్రజానీకము, ప్రభుత్వము కూడ యింతమాత్రంచేత తమబాధ్యతలను గుర్తించునని నమ్మకం లేక నిరాహార దీక్షపూని ప్రారంభించారు.

నిరాహారదీక్ష యంటే సామాన్యమయినదికాదు. పవిత్రమైనది. తాను ధర్మంగాను, న్యాయంగాను ప్రజాహితముగా నుద్దేశించినవానిని సాధించుటకు అవసరమయితే ప్రాణాలను సయితము అర్పించడానికి పూనుకొనడం మహోన్నతమయిన త్యాగమని పించుకొంటుంది. ప్రజలు యీదీక్షను చూచే దృష్టిమీద నాధారపడి యుంటుంది రాష్ట్రనిర్మాణం.

ఈసందర్భములో భారత స్వాతంత్ర్య సమరచరిత్ర నొకసారి స్మరణకు తెచ్చుకొనండి. దేశానికి మొత్తానికి స్వాతంత్ర్యము ఎట్లు ముఖ్యంగానుండిందో ఆర్థిక, వైజ్ఞానిక, భాషాభివృద్ధికి ఆంధ్రులకు రాష్ట్రనిర్మాణము అంతముఖ్యమైనదే.

స్వాతంత్ర్య సమరంలో పురుషులు, స్త్రీలు, పిన్నలు, పెద్దలు అనేవిచక్షణ లేకుండా వీరోచితంగా పోరాడాము. విజయము సమకూరింది. ఈవిజయంతో మనకు ఆశయం సిద్ధించలేదు. అన్నివిధముల మనకు, మనయభివృద్ధికి అవసరమయిన రాష్ట్ర నిర్మాణం సాధించిననాడే మనము సంపూర్ణ విజయులమనిపించు కొంటాము. అందుకు స్వామీ సీతారాంగారి నిరాహారదీక్ష మార్గదర్శక మగుగాక! ఉద్యమం దేశ వ్యాప్తమగుగాక! ప్రజానీకం ఆబాలగోపాలం నడుములు బిగించి మహోన్నతము లయిన త్యాగములు చేయుటకు సిద్ధపడుదురుగాక! ఈవిధంగా ఏకోన్ముఖంగా తమదీక్షా యుతమైన శక్తి సామర్థ్య పరాక్రమాలను ప్రదర్శించిననాడు రాష్ట్రనిర్మాణం తప్పక జరుగుతుంది. స్వామీసీతారాం బోటివారి అచంచలమైన దీక్షాత్యాగాలు సార్థక రూపాన్ని పొందుతవి.

——)o(——




శ్రీమతి అద్దేపల్లి లక్ష్మి

[మధురాపురం గ్రామం పెద్ద మోతుబరీ కాదు. కుగ్రామం అంతకంటే కాదు. మధ్యమ తరగతిలో నుంటుంది. సుబ్బయ్య గ్రామానికి తగ్గరైతు. పురుషోత్తం, సత్యం, రామం, చేతికందిన ముగ్గురు కుమాళ్లు, జానకి పెళ్లీడుకుమార్తె. భార్య మంగమ్మ పూర్వకాలపు మనిషి. పెద్దకుమార్డు పురుషోత్తం, చేతికందిన వాడైనా, కొంచెం పెడదారి పట్టి, బండిచక్రం నాగలి మార్కు జెండావారితో తిరుగుతున్నాడు. సత్యం ఇంటిపట్టునేవుండి తండ్రికి చేదోడు వాదోడుగా వ్యవసాయం చూస్తున్నాడు. మూడవవాడు రామం ఇంజనీరింగు కాలేజిలో చదువుతున్నాడు.]

## ప్రథమం

(సుబ్బయ్య భవంతి. వీధిలో ఎత్తైన అరుగులు ఉంటాయి. లోపల చావిడి. చావిడిలో ఒకమూల వడ్లబస్తాలు, ఒకప్రక్క టేబిలు, కుర్చీ అమర్చబడియుంటాయి. సుబ్బయ్య చుట్ట కాల్చుకుంటూ చాప మీద కూర్చుని వుంటాడు. రామం ప్రవేశం.)

సు:-ఏరా, రామం! మీ కాలేజి ఎప్పుడు మళ్లీ.

రా:-ఇంకొకవారం రోజులలో వెళ్లాలి నాన్నా. వెళ్లగానే కాలేజిజీతం కట్టాలి, హాస్టలుబిల్లు చెల్లించాలి, క్రొత్తపుస్తకాలు కొనాలి. వీటన్నిటికి మొత్తం ఒకమూట అయితేగాని చాలదు నాన్నా. మరి డబ్బు జాగ్రత్త బెట్టు.

సు:-ఏంజీతాలో, ఏంచదువులో, వేలకువేలుపోసి ఇల్లు, ఒళ్లు గుల్లచేసుకోనడమేగాని ఫలితం ఏమీ కనపడటంలేదు. వెయ్యిరూపాయ లెందుకురా? ఒక సంవత్సర గ్రాసం, ఒక్క నెలలో ఖర్చు పెట్టుతానంటావు రామం!

రా:-మరి ఎట్లాగనుకున్నావేం నాన్నా! ఉద్యోగాలంటే ఊరికే వున్నాయా? ఈ కాంగ్రెసు గవర్నమెంటు ఉన్నంత కాలం ఈఅవస్థలు తప్పవు. నీవేమో కాంగ్రెసు అంటే కరిగిపోతావ్. ఆరు నూరైనా, నూరు ఆరయినా కాంగ్రెసు పార్టీయేమంచిదిరా, అదేమనకు జీవగర్రరా అంటావ్. మొన్న ఒక మంత్రిగారేమన్నారో తెలుసా? ప్రాజెక్టులుగట్టి, సరిగా నీటిసరఫరా చేసి పొలాలు, పంటలు వృద్ధిచెయ్యరాదా అని అడిగితే, తగిన సిబ్బందిలేదు, ఇంజనీరింగు శాఖవారి కొరత చాలవరకు దేశాన్ని ఏడిపిస్తోంది అన్నారు. మరొక మంత్రిగారు ఏమన్నారంటే, "ఈ కళాశాలల్లో ప్యాసయే వారందరకు ఉద్యోగాలు ఎక్కడనుంచి తెస్తామయ్యా? అందుకనే కళాశాలలో సీట్లు తగ్గించి వేయటం." అంటారు. చూడుమరి, వాళ్లలోనే ఒకరు ఏటికిలాగితే ఇంకొకరు కోటికి లాగుతున్నారు.

సు:-కాదురా అబ్బాయి. కట్టప్రాజక్టులు కట్టుతూనే వున్నారా! ఉద్యోగంలోకి తీసుకునేవారిని తీసుకుంటూనే వున్నారా? ఏ పనైనా నెమ్మదిమీద జరగాలిరా తొందరపడితే ఎలా?

రా:-ఈ యిచ్చే నాలుగు సీట్లలోను కులం, మతం తత్వం, విచారణ. చదువుకునే తెలివితేటలు, అర్హత ఉన్నవారియొక్క అవకాశాన్ని ఎందుకు పోగొట్టడం? ఎక్కడున్నావే గొంగళీ అంటే, వేసినచోటనే వున్నానే కంబళి అనేవాళ్ల

ముడ్డిపట్టుకు తోయటం ఎందుకు? కావాలంటే వార్ని చేర్చుకోమను. ఇంకోకవిధంగా వారికి ఎక్కువ అవకాశం కల్పించమను. అంతేగాని...

సు:-అన్నిమతాలవారు, కులాలవారు, వర్గాలవారు పైకి రావాలంటావా? తక్కువ అవకాశాలల్లో వుండి, క్రిందకు అణగద్రొక్కబడ్డవారికి మరి మార్గాన్వేషణ చేయాలంటావా? అందుకోసం గవర్నమెంటు ఏదో పంథా తొక్కాలా, అక్కర్లేదా?

రా: ఏదో ఒకమార్గం అనుసరించాలి. వద్దనను నాన్నా. ఆ అనుసరించే మార్గం, న్యాయసమ్మతమైనదిగాను, సబబుగానుండాలి. లేకపోతే యథారాజా, తథాప్రజా అవదా నాన్నా! మన పావన కృష్ణానదిజలంతో సంగమేశ్వర ప్రాజెక్టు, పులిచింతల రిజర్వాయరు కట్టవలసింది పోయి, మన తెలుగు పొలాలు పండించవలసింది మాని, ఆ జలాన్ని ఎక్కడో మద్రాసు, ఆర్కాటు చెంగల్పట్టు జిల్లాలవారి సదుపాయాల కోసం వినియోగించడం ఏమంత సబబో చెప్పు నాన్నా?

సు:-అరేరామం! నీవు నూరుచెప్పు, వెయ్యిచెప్పు, కాంగ్రెసు యొక్క దృక్పథంఏమో తెలుసా? సర్వమానవసౌభ్రాతృత్వం, అందరుసమానం, అందరు బాగుపడాలి, దేశమంతా ఒకటేఅని. ఆ కార్యాలన్నీ ఈ సూత్రాలమీద ఆధారపడివున్నవే. సరేగాని ఇప్పుడెందుకు ఆగొడవ అంతాను, నీకు కావలసిన పైకమేదో పట్టుకుపోయి, దుబారా ఖర్చులు చేయకుండా జాగ్రత్తగా చదువుకో. (నిష్క్రమణ)

ద్వితీయం

(సాయంకాలం - అయిదుగంటల ప్రాంతం - గ్రామచావిడి - రేడియో పాడుతూంటుంది. మునసబు, ఇంకా ఇద్దరు ముగ్గురు ఆసాములు కూర్చుని వుంటారు. సుబ్బయ్య ప్రవేశం.)

మునసబు .ఏం సుబ్బయ్య బావా! మరీ నల్లపూసయిపోతున్నావే. ఈ మధ్య ఏదీ ఒకపొగాకు కాడ ఇట్లా పారెయ్యవోయ్.

సు:-ఎక్కడ కనపడ్డా పొగాకు చేయిచాపందే వూరుకోవుగా మునసబూ? (అని పొగాకు ఇచ్చును.)

ము: మాకందరకు పప్పన్నాలు పెట్టతలచటంలేదా ఏమిటి బావా! ఎన్నాళ్లకూ?

సు:-నీకు ఎంతతిన్నా పరగడుపే మునసబూ, అయినాగాని అమ్మాయికి కడసారం పదిఅయిదో ఏడు. ఇంకా ముక్కు పచ్చలారలేదు. దానికి అప్పుడే పెండ్లి, సంసారం ఎందుకోయ్. కాస్త బలంపట్టి, నాలుగు సంగతులూ తెలిసినాక చేద్దాం అని వూరుకున్నా. అయినా మా రామం చదువు పూర్తిగావాలి.

ము:-అవునులే అప్పుడయితే అటుకట్నం తీసుకొని, ఇటుఇచ్చేదామని. మాకయితే ఏముంది. పెద్దపెద్ద కట్నాలు ఇవ్వలేముగాబట్టి పెందలకడేతగిన మనువు చూడ్డం, కట్టేయడం.

సు:-ఏయ్ మునసబూ, నేను ఇదివరకు కట్నాలు పుచ్చుకున్నానా చెప్పు; రామానికి అంతే, మా జానకిని ఇవ్వడం అంతే. కట్నాలు అనేది మా ఇంటావంటా లేదు. కట్నం అడిగిన వాడితో అసలు కలిసి మాట్లాడేదేలేదు.

ము:-అవి సరేగాని సుబ్బయ్యబావా! ఏమిటి ఈ కంట్రోళ్లు ఈ రేషనున్నూ. బియ్యం చక్కగా పండే మనజిల్లాలో మనకు ఈ అర్థాకలికూడు ఏమిటోయ్ - లేనివాళ్లకు లేనేలేదు.

సు:-నీవనేది నేను కడుపునిండా తింటాను కలిగినవాణ్నిగాన, లేనివాళ్లసంగతి నాకెందుకు అని. మరిగవర్నమెంటు నీఅంత స్వార్థభూయిష్టమైనది గాదుగా. ప్రజల గవర్నమెంటు. ప్రజలచేత నడిపింపబడుతోంది. ప్రజలకోసం పాటుబడుతోంది. అందుకని సర్వప్రజల శ్రేయస్కరం

కావాలిగాని, నీ అంత సంకుచిత భావాలతో వుంటే ఎట్లా? మొన్న రామయ్యగారి అమ్మాయికి జబ్బుగా నుందంటే పన్నిపాతపుకుప్పె ఇచ్చావా లేదా? మీయింట్లోది. నాకేందుకులే అని పడుకోకబోయినావా? మీయింటి సంగతి కాదుగా! ఇదీ అంతేనోయ్ మునసబూ.

ము:-ఏమి అంతేనో! కట్టుకుందామంటే పంచలు లేవుగదా. మార్కెట్టులో పంచలు ఆకాశంలో కూర్చున్నాయి. తిందామంటే తిండి లేదుగదా! ఏమిటో ఈ గవర్నమెంటు. పిల్లవాడికి పాలడబ్బా లేదు. అమ్మ పెట్టాపెట్టదు, అడుక్కు తినానివ్వదు.

సు:-ఓయ్ మునసబూ, ఇంకానయం, ఈకాస్తయినా ఈకాంగ్రెసు గవర్నమెంటు వుంది కనకనే. అదే ఇంకొక పార్టీ అయితే ఎముకల పోగులతో మిగిలేవాళ్లం. కష్టేఫలీ. కొంచం ఓపిక పట్టు. లంకణాలల్లో వున్నవాడికి ఆరోగ్యం పట్టాలంటే ఒక్కసారి వీలవుతుందా! నెమ్మదిగా రావాలిగాని.

ము:-ఏమో మరి మాపురుషోత్తం మార్గం, ఆకబురే బాగున్నాయిలాగా కనపడుతోంది. అయితే మరి ఇంక వాడంతేనా! అలా వదిలేశావు.

సు:-ఏం చెయ్యను? నేను అన్నివిధాల చెప్పిచూశా. చిన్నవాడా, చితకవాడా, కొట్టి ఇంట్లో కూర్చోపెట్టడానికి. వాడిఇష్టం, ఇంక పొద్దుపోయింది. పాలేరువస్తాడు ఇంటికి పోతా! (వెళ్లిపోవును.) రేడియో అట్లాగే పాడుతూవుంటూంది.

ము:-చూచావోయ్ లక్ష్మయ్యా పురుషోత్తం అనేటప్పటికి సుబ్బయ్యబావ ఇంటికిపోయాడు. వాడిమార్గం ఆయనకేమీ నచ్చలేదోయ్. ఏం చేస్తాడు పెద్దవాడు.

## తృతీయం

(మరునాడు ఉదయం 9 గంటలవేళ. వీధిఅరుగుమీద సుబ్బయ్య చుట్ట కాలుస్తూ మునసబుతో మాట్లాడుతూవుంటాడు. పురుషోత్తం ప్రవేశం.)

సు:-ఏరా పురుషోత్తం! నీవు ఇంట్లోంచిపోయి పదిరోజులు కావస్తోంది. కట్టుగుడ్డలతో ఇంతవరకు ఎక్కడ తిరుగుతున్నట్టురా!

పు:-మాపనిమీద మేం తిరుగుతున్నాం నాన్నా.

సు:-అయితే నువ్వు ఆపార్టీనుంచి బయటకు రావురా! నీకు ఎందుకొచ్చిన గొడవలురా. కమ్మనిపాడి త్రాగుతూ ఇంటిపట్టున వుండలేక ఆచూరూ, ఆచూరూ పట్టుకుతిరగడం ఏంకర్మంరా నీకు. రాజాఅయిన పార్టీ వుంటే ఎక్కడదో ఒక ఎర్రజెండా తీసుకుని బయుద్దేరుతావు?

పు:-అవును రాజాఅయినపార్టీయే మీకందరకు; నాకుగాదు. ప్రజలు ఆర్థాకలితో మలమల మాడుతూంటే, మా నాన్నే కాపాడుకునేందుకు, చిరుగుడ్డ పీలికలయినా లేవే! ఇదేగా ప్రజల సుఖం! ప్రజాగవర్నమెంటు మూలంగా నాన్నా?

అధికారుల బలం, దర్పం పెరిగిపోయి, బ్లాకు మార్కెట్లు దురాశ మితిమీరిపోయి కడుపుమంట రగిలిపోతున్న ప్రజల గవర్నమెంటు రాజాపార్టీయేగా? రాచకీయ రంగంలో కక్షలు, స్పర్థలు, ఈర్ష్యలు పెరిగిపోయి కుళ్లిపోతున్నపార్టీ రాజాపార్టీ కదూ! వరదలతో పైరులుపోయి ప్రజలు బాధలుపడుతుంటే అనుభవించే సౌఖ్యం రాజాపార్టీ మహిమేగా? ఎక్కడచూచినా ఇనుపగజ్జలతల్లి స్వైరవిహారంచేస్తూ, వికటాట్టహాసంతో చిందులు త్రొక్కుతూంటే ప్రజలుపొందే ఆనందం, మహదానందం ఈపార్టీవల్లనేగదూ నాన్నా!

ము:-భలేగా అడిగావు పురుషోత్తం.

సు:-ఒరే పురుషోత్తం, ప్రజలు బాధలుపడుతున్నారన్నవిషయం గాదని నేననుకాని, ఏపార్టీ వున్నా ఈబాధలుతప్పవు; ఇంకా ఎక్కువేగాని. నెమ్మదిమీద గవర్నమెంటు ఇవ్వన్నీ చక్కదిద్దుకోస్తోంది. తొందరయితే ఎలారా?

పు:-తొందరేమిటి నాన్నా, ఇక్కడికి దాదాపు 150 కోట్ల రూపాయలు పంటవృద్ధి ప్రచారణ క్రింద ఖర్చుపెట్టారుగదా? ఏమిఫలితం వచ్చింది? 500 కోట్ల రూపాయిలుపెట్టి ఇతరదేశాలనుంచి ధాన్యాన్ని కొన్నారే! ఈడబ్బంతా వారికెట్లా ఈయటం? ఈడబ్బుపెట్టితే ఈపాటికి నాలుగు రామపాద సాగర ప్రాజెక్టులు తయారయేవి గదా? ఈ దరిద్రదేవత తొలగిపోదూ? బంజరుగా పడివున్న భూములను పేదరయితుల కిచ్చి సాగుచేసుకోమంటే చేయరూ? ఇంకా అనేక మార్గాలుంటే అవ్వన్నీ సరిదిద్దుకోక ఎవరికి తోచిన దారిని వారుపోతూంటే దేశం బాగుపడుతుందా? ఈ రాజాపార్టీ బాగుపడనిస్తుందా? బొజ్జలన్నీ నిండుకున్న తర్వాత వారికి పార్టీ ఎందుకు దేశం ఎందుకు.

సు:-150 కోట్లు ఖర్చుపెట్టారో పంటవృద్ధి చేశారో ధాన్యం ఇతర దేశాలనుంచి దిగుమతిచేసి ప్రజలకు అమ్ముతున్నారు లేకపోతే బ్రతికేది ఎట్లా! ఏపార్టీ గవర్నమెంటులో వున్నా సరే ఈపనులన్నీ ఆపార్టీ గవర్నమెంటు చేయక తప్పదు.

పు:-ఇంకొకప్రక్క మరొకదేశం మనమీదికి దండెత్తి వస్తూంటే వారికీ ఇంకా బొగ్గూ, గట్రా సప్లయి చేయడమూ? ఎక్కడ రాజనీతి ఇది?

(సత్యం ప్రవేశం)

సత్యం:-తాశీల్దారుగారు వచ్చారు నాన్నా. ఇంకా ధాన్యపు బస్తాలేమైనా వుంటే పట్టుకరమ్మంటూ కూర్చున్నారు గ్రామచావిడిలో.

ము:-తాశీల్దారా? వచ్చాడా! అయ్యో పోవాలి (పరుగెత్తును.)

పు:-చూచారా నాన్నా ఇంకా ప్రొక్యూరుమెంటు. సరిగా పంటపండించుకునే విధానం తెలియక గ్రామాలవెంబడి ఎగబడి ధాన్యంకోసం దేవులాటలు-బెదిరింపులు.

సు:-మనదగ్గర ఇంకా ఏమున్నాయిరా, మొన్న యిచ్చేస్తిమిగా మన ఇంటికి సరిపడ వున్నాయి అంతేగాని కావాలన్నప్పుడల్లా వచ్చి ఇమ్మంటే ఎక్కడనుంచి తెచ్చియిస్తాము. ఏం చెప్పావు సత్యం నీవు?

స:-నేను మా ఇంటిదగ్గర ఇంకా ధాన్యం లేదని చెప్పాను. ఉన్నదేమో ఇదివరకే ఇచ్చాము. తీరిగి విత్తనాలకుగూడా లేకుండా పోతుంది మనం ఇంకా ఏమైనా ఇస్తే.

(తాశీల్దారు ప్రవేశం మునసబుతో.)

తా:-ఏమండీ సుబ్బయ్యగారు తిరిగి మీవూరురాక తప్పిందిగాదు.

సు:-అయ్యో రండి కూర్చోండి. దాహంగావాలా ఏమీ కబురుచేయకుండా వచ్చారు.

తా:-ఏదండీ కబురుకుగూడా సావకాశం ఎక్కడా!
- ఎంతసేపు ప్రొక్యూరుమెంటుతో సరిపోతోంది. నిద్రపోయి ఎన్నాళ్లయిందోలాగా వుంది. ఏం ఉద్యోగమోగాని.

పు:-ఉద్యోగానికేమండి చక్కటి ఉద్యోగం సంపాయించారు జేబులునిండేది. మీకేం రాజులు. చచ్చేది రయితులుగాని.

తా:. ఏమండీ మరి ఏం చెప్తారు సుబ్బయ్యగారూ.

సు. ఏం చెప్తాం. ఉన్న మిగులుధాన్యం ఏదో ఇదివరకే ఇచ్చాం. ఇంక యింటికి సరిపడది మిగిలింది. మరి ప్రజలుఅంత బాధపడుతుంటే, ప్రభుత్వం వారు ఇలా తిరుగుతుంటే కాదనగలమా! సత్యం ఒక పదిబస్తాలు కొలిపించు.

స:-ఎట్లా నాన్నా, తర్వాత మనం ఇబ్బంది పడ్తాము. చాలా చిక్కులోపడ్తాము.

పు:-ఇవ్వరా సత్యం. నీకేంరా పదిబస్తాలు కాకపోతే వందబస్తాలు కొలు. ఉన్నవన్నీ కొలు. ప్రజకోసం, పార్టీకోసం గవర్నమెంటుకోసం.

తా:-సెలవుపుచ్చుకుంటా సుబ్బయ్యగారూ. (వెళ్లును)

## చతుర్థం

(రాత్రి పదిగంటలకు పడకగది. సుబ్బయ్య మంచంమీద కూర్చుని ఏదో ఆలోచిస్తూ వుంటాడు. మంగమ్మ మంచినీటి చెంబుతో ప్రవేశం.)

మం:-ఏం దిగాలుపడి కూర్చున్నారు దివాలాతీసిన షాహుకారులాగా!

సు:-నీకంతా వెక్కిరింపులూ — వేళాకోళాలున్నూ.

మం.-వెక్కిరింపుల కేంగాని మరి జానకి పెళ్లిమాటేం చెప్పారు? ఏమన్నా సంబంధం చూడటంవుందా లేదా? మా తమ్ముడి కొడుకు పనికిరాడా యను ఏదోకట్నం అడిగారని

సు:-ఇప్పట్నుంచే పెళ్లి ఎందుకే దానికి.

మం.:మరి ఇంకెప్పుడు. దానికి పెళ్లివద్దు. ఇంట్లో సున్నధాన్యం అంతా బయటివాళ్లకి కొలిపించటం, పురుషిగాడేమో వాడిష్టంవచ్చినట్లు వాడుతిరగడం. పెళ్లామేమో ఊసూరుమంటూ కూర్చోపడం. రామం వాడిదార్ని వాడిచదువూ. ఇంక ఎటొచ్చీ సత్యంఒక్కడూ వ్యవసాయం. బాగానే వుంది.

సు:-ఏం బాగో. అంతా అయోమయంగావుంది ఎవరిదారి వారిది నలుగురున్న కొంపలో. ఎవరికివారే యమునాతీరే అన్నట్టుగావుంది. ఒకరికి ఒకరు కలిసిరారు. ఒకడు తూర్పు, ఇంకోరు పడమర. అంతా అయోమయం.

—(౦)—

## చందమామ



బాల బాలికలకు నెలబాలుఁడ వయి  
పాలు పెరుఁగులు తోడుగాఁ బడసెవోయి!  
ఒంటరిగ దిర్గ భయములేదోయి రేయి?  
పసితనపుఁజేత లిఁకనైన వదలవోయి!  
ఇరువ దేడ్గురు నిదివఱకే గ్రహింప  
రోహిణీదేవియెడఁ బ్రేమ యూఢియయ్యె  
ఇక నెందఱఁ బెండ్లాడ నెంచినావొ!  
చాలులే మామ! భావ్యమ్మ? చందమామ!  
"శూరుఁ డగువాఁడు పగటి సంచారి యగును  
ప్రాఁకు నర్థరాత్రమున దోషాకరుండు"  
అనుచు నా బాల గోపాల మపహసింప  
నెత్తిపైఁ బెట్టుకొనె నిన్ను మిత్తిగొంగ.

చదలవాడ నాగరత్నము.

# స్త్రీ !

పాలవెల్లి నీవోతల్లి !
శ్రమజీవుల కల్పవల్లి !!
ఈజగతీ సౌందర్యరేఖాలాస్యం
చేయు నీదివ్యచరణారవింద దాస్యం
పాలవెల్లి నీవోతల్లి!
శ్రమజీవుల కల్పవల్లి !!
జీవిత సాగరాన్ని తరింపజేయు పడవ
నలిగి పగిలిన ఎదకు మృతముపోయు కడవ
బండబారిన బ్రతుకుతెరువులకమృతసేదనము
వలపుబరపుల నెత్తావి మలయు నీలోచనము
పాలవెల్లి నీవోతల్లి !
శ్రమజీవుల కల్పవల్లి !!
స్వార్థత్యాగానికి నీవుచేసిన ముందడుగు
నరజాతి వికాసానికి నీవుపట్టిన గొడుగు
పాలవెల్లి నీవోతల్లి !
శ్రమజీవుల కల్పవల్లి !!
శిశుపోషణలో నీవుచూపే పరిశిక్షణ
దేశసౌభాగ్యమునకు నీవిచ్చే రక్షణ
పాలవెల్లి నీవోతల్లి !
శ్రమజీవుల కల్పవల్లి !!
కష్టసుఖాలు లాభనష్టాలు నీహస్తం
లో రెండూ ఇమిడి ఉందీజగము సమస్తం
పాలవెల్లి నీవోతల్లి !
శ్రమజీవుల కల్పవల్లి !!
ఎదీ ఎక్కడా నీవులేందే జరగదునిత్యం
ఇది ఏనాడో లోకం గుర్తించిన సత్యం
పాలవెల్లి నీవోతల్లి!
శ్రమజీవుల కల్పవల్లి !!

స్థానం ముత్తుకుమార్

# పురుషులకు పెళ్లి ఎందుకో?

శ్రీమతి కె. వి. రమ

ఈమాటను సోదరులకు వెటకారమేకాదు కోపంకూడా రావచ్చు. నేను చెప్పేది అంతా విని అయినా అనుమానానికి జవాబు ఎవరికివారు చెప్పుకోగలిగితేచాలు.

ఈ వివాహితుల వింత ప్రకృతి అనేక విధాలు. తమకు నచ్చి చేసుకున్నా, ఒకళ్ల బలవంతంమీద ముడివేసినా, ప్రేమించి సహజమైనఫలం అనుభవిస్తున్నామనుకున్న తమభార్యఅని సంఘంచెప్పే స్త్రీ వైపు తమరు తప్ప యితరులెవరూ రెప్పవెయ్యకుండా చూడకూడదని సిద్ధాంతం చేసుకుంటారు. ఆ చూచినవారికళ్లల్లో ఎన్నో కోరికలు అణగిఉన్నాయనీ, తమ స్త్రీపై మోహపడి ఆ చూపులో తమమనస్సులోనిది బయటపెటుతున్నారని వీరినమ్మకం. ఉండవలసిందే. ఉండడం సహజంకూడా. తమసొత్తు నింకొకరు ఆదేపనిగా చూస్తుంటే, ఏమరుపాటుగా ఉన్నపుడాసొత్తు అపహరిస్తారన్నజంకు ఉండడం న్యాయం. ఇంక స్త్రీకి యోచనాశక్తి, విచక్షణాజ్ఞానం, తరతరాలుగావస్తున్న స్త్రీ ధర్మం, సంఘనిర్ణీతమయిన నీతి అవినీతుల భయం ఉండడంచేత తమ స్త్రీలమీద నమ్మకమున్నా, మనస్సు చంచలమైనది; వ్యక్తికిమార్పు సహజంఅన్న బెంగతో పొరపాటున తమ స్త్రీలు యితరులవలలో పడిపోతారన్నజంకు ఉండచ్చు. కాని తమను గురించి తమ భార్యలుకూడా యిలాంటిభావాలే కలిగిఉంటారంటే అతిశయోక్తికాదు. సంసారిపిల్లలు, వితంతువులు, వ్యభిచారిణులు, అమాయకులు, వ్యభిచారులు అన్న వ్యత్యాసం లేకుండా కృత్రిమ పూతలతోనో సహజ సౌందర్యంవలననో కంటికింపుగా ఉన్న స్త్రీని, యివిలేకపోయినా యౌవనంలో ఉన్న బాలనూ ఎంత ఆశతో, తమకంతో, కోరికతో, తనివితీరా చూస్తారో! అంతేకాదు ఏదైనా వీలుకొరికితే, అవినీతి అనుకోక ఆఘడియా కక్కుర్తిపడతారో! ఆదేఒకపేరుపడ్డ జారిణి అయితే దానిచేతులలో చిక్కి యిల్లూ, భార్యా, సంసారంమరిచి కట్టుకున్నదాన్ని ఎన్నిపాట్లు పెడతారో! ఇంతదానికి పెళ్లిఎందుకు?

కాదు. మేంఉద్యోగానికెళ్తాంగనక యింటిపనులు చేసిపెటుతుందని చేసుకుంటున్నా మంటారా? ఇది స్త్రీలకూ తెలుసు. జాగ్రత్తగా చేతనైనంతవరకూ తృప్తిగా వంటచేసినా, యిల్లుసర్దినా వాటికి వంకలు పెట్టకుండా, నేరంమోపినట్టు తప్పులెంచి ముఖం ముడుచుకుంటారేం రానురాను? సంతోషించాలనే చేస్తారుకాని విసుగుకోవాలనా? తెలియకజరిగిన లోపాలను ఏవోకబుర్లలో కలిపిచెపితే సరదాగా సవరించుకోవచ్చుకాని హేళనా కోపంచూపిస్తే విరక్తీ, విసుగేకాని ఫలితం?

ఇందుకూకాదు. పిల్లలను కని పెంచడానికంటారేమో. ఆ బాధ్యత యిరువురిమీదా ఉంటుందే. ఇంట్లో పిల్లఏడిస్తే భార్యతప్పు. పిల్లకు పాలుచాలకపోతే, పాలుకొనడానికి డబ్బుచాలకపోతే, బ్లాకు మార్కెట్టులోనైనా దొరక్కపోతే దానిదేనేరం. పిల్లలను పెంచడానికి, చదువులు చెప్పించడానికీ, ఆడపిల్లలైతే పెళ్లిళ్లుచేయడానికీ చిక్కులుపడుతూ 'కనిపారేసింది' అని దాన్నే ఆడిపోస్తారు. చివరికొచ్చి పిల్లలు తమమాటే వినాలికాని, తల్లిమాట పాటించకపోయినా తగువులేదు.

అదీకాదు. పెళ్లి మనసంఘంలో ఆచారమైపోయింది. ఎవరో ఒకరిని చేసేసుకున్నాం. అంతే కాని దీనికంత ప్రాముఖ్యం యివ్వలేదంటారా? అంత బలవంతమేమొచ్చింది. మనసులేని మనువెందుకు? కట్నాలకోసం, ఆస్థులనాశించి, వ్యక్తిత్వంలేని పశుప్రాయులుగా ఇంతతిండిపడేసి గానుగఎద్దులాగ దినచర్యలో మార్పులేకుండా తమరు చెప్పినట్టే తూచాతప్పకుండా కనుసన్నలమెలగాలనా? ఆ మాత్రం ధైర్యం లేదూ చెప్పడానికి. నేను యీ పిల్లను గౌరవంగా చూడలేను. దీనికి చదువుచాలదనో, సంగీతంరాదనో, నడకలో నృత్యం చూపలేదనో, మాటలలో అభినయంలో నాటకకళ చూపదనో ఏదోచెప్పొచ్చే. ఇది యింట్లో ఉండగా మనస్సు తృప్తిపరచుకోలేక ఇంటిబయట ఆనందించాలన్న బాధ ఎందుకు? ప్రేమించి చేసుకున్నామనే పురుషులుకూడా తమ ఆ ప్రేమికను ఎక్కువగా జబ్బుచేసినా, ముఖానికుండే అందంపోయి ఆకారంలో మార్పువచ్చినా, దానికన్న యింకా కొంచెం యింపుగా కనిపించి, నేర్పుగా కబుర్లుచెప్పే పిల్ల కనిపిస్తే ప్రేమ దినదినం పెడత్రోవలు పడుతుందే!

'బ్లమ్' అనే పాశ్చాత్య రచయిత చెప్పినట్లు వివాహానికి ముప్ఫది, నలుబది సంవత్సరాలమధ్య వయస్సు మంచిదని ఎవరో అంటే అసహ్యం అనిపించింది. కాని మనసంఘంలో ఎక్కువగా కనిపించే వివాహిత కన్యల జీవితాలు చూస్తుంటే అదే మంచిదేమో అనిపిస్తోంది. ఏంఅంటే ఆ వయస్సు వచ్చేసరికి యౌవనమదం అణిగిపోయి, యుక్తాయుక్తాలు, బాధ్యత, వివాహావసరం బాగా వంటబడతాయి. మనసెవరంటారు? అనేనిరసనభావం తగ్గుతుంది. వైజ్ఞానిక దృష్టిలో శారీరికంగానూ, మానసికంగానూ యిది వ్యక్తికీ, వివాహజీవితానికి మంచిదికాదంటే సానుభూతి, వ్యక్తిత్వ గౌరవం, నీతినియమాలూ, మానసిక శాస్త్రం (Psychology) పురుషులను ముఖ్యంగా నేర్వాలి. తనుచేసుకున్న స్త్రీని సుఖపెట్టి తనుసుఖపడే పద్ధతి తెలియనంతవరకూ పురుషునికి పెళ్లిఎందుకు?

మరి స్త్రీలమాట అంటారేమో కొందరు బాధిత హృదయులు. పురుషులను బాధపెట్టే స్త్రీలు, స్త్రీలను బాధపెట్టే పురుషులకన్న చాలా తక్కువమంది ఉన్నారు. పురుషుల మనోప్రవృత్తి మార్చుకోవాలని నేనంటున్నానంటే ఆ తక్కువ సంఖ్యలోఉండే పురుషత్వంచూపే సోదరీమణులను సమర్థిస్తున్నానని కాదు. అధిక సంఖ్యాకులు ఆదర్శప్రాయంగా సుఖమయ సంసార జీవితం గడుపుతుంటే మిగిలినవాళ్లు వారినిచూసి నేర్చుకోవడానికి సావకాశం ఉంటుంది.

# మన మర్యాదలు!

★

కె. సభా.

అనబోకు అనబోకు
అనబోకు నాయమ్మ
ఓసి రావేయని
ఈసడించకు తల్లి!

♦ ♦ ♦

తనువులో బుట్టిన తనయనై తేనేమి
పనికత్తె దాసియును పడతులోయమ్మ
చనువుకైనా గాని సంస్కృతిని చూడాలి
మునుల గుణముల మణుల ధనము లివి
యమ్మా!

♦ ♦ ♦

కులము తక్కువలంటు చులకనెందుకు తల్లి
కలిమి లేములగాంచి తూలనాడకు చెల్లి
పాలేరులైననూ బానిసలుగారమ్మ
జాలిగుండెలతల్లి చాలు లివియమ్మా!

♦ ♦ ♦

మర్యాదలోమనము మనుష్యులై మెలగాలి
ధర్మాలలో గొప్ప ధర్మమిదియమ్మా
కర్మాలలో పెద్ద మర్మమిదియేనమ్మ
కరుణాసాగరికొక్క కాల్వయిది యమ్మా!

♦ ♦ ♦

విన్న ఒకమాటకే వెన్నపూసలగుండె
కన్నుదగిలిన పుల్ల తెన్ను జౌతుందమ్మ
మన్నించుహృదయాలు మనజాతిమాన్యాలు
ఎన్నితడవలుగాని ఎదురాడవమ్మ!

♦ ♦ ♦

చీవాట్లలో కొంత చీదరింపుల కొంత
దావానలము పగిది నయనాలలో కొంత
వకిలికలతో ముఖము కందగడ్డై కొంత
భావాలలో హింస పారించబోకమ్మ!

♦ ♦ ♦

పలుకు పలుకున జాలి తొణికించవలెనమ్మ
కలువ చలువల చూపు కావాలి మనకమ్మ
చులకనలు గావమ్మ సూత్రాలు యివియమ్మ
మేలుకో శేవారిశ్రీలు యివియమ్మా!

♦ ♦ ♦

అనబోకు అనబోకు
అనబోకు నాయమ్మ
ఓసి రావేయని
ఈసడించకు తల్లి!

# దేశమా — భర్తయా

శ్రీమతి వీరంరాజు వేంకటరమణాదేవి

(గత సంచిక తరువాయి)

౪

శక్తి రమను వదలివెళ్ళి సంవత్సరమయింది. అప్పటికి యిప్పటికి పరిస్థితులెంతో తారుమారయినవి. శక్తికోసం కలలుగన్న రమ యీనాడు అతనిని అమితంగా ద్వేషిస్తున్నది. అతని పేరంటేనే తోకత్రొక్కిన త్రాచువలె మండిపడుతున్నది.

శక్తిసింహుడు అన్నతో తగవులాడేడు. భారత స్వాతంత్ర్య జ్యోతి, అపర యుధిష్ఠిరుడు, ధర్మమూర్తియైన రాజర్షి ప్రతాప్‌ను దూషించి, అవమానించి, ధిక్కరించి, దేశద్రోహానికి ఒడిగట్టాడు. రాజ్యక్షేమంకోరని తమ్ముని దేశబహిష్కరణ గావించాడు. అన్నమీద క్రోధంతో, పగతీర్చుకోవలెనని అక్బరుపక్షంచేరాడు. అక్బరుకు రాణాప్రతాప్‌ను పట్టియిస్తానని నిండుకొలువులో బీరాలుపలికాడు. శక్తి సింహునికి చిత్తూర్ కోటను కట్టబెట్టుతానని మాటయిచ్చాడు అక్బరు.

రమలో ద్వేషం, క్రోధం, అవమానం, బెంగ, దిగులు, భయం, జాలి విహారం చేస్తున్నాయి. రమ హృదయంలో శక్తిసింహుడికి కించిత్తైన స్థానంలేదు. ఆమెలో ప్రేమ సాగరం ఎండిపోయింది. ఆమె హృదయంలో అగ్నిపర్వతంలాంటి ద్వేషం పొగలు గ్రక్కుతున్నది.

ఒకరోజు అర్ధరాత్రి రమ ఏదో తీవ్రంగా ఆలోచించుకుంటూ మేడపైన అటుఇటూ కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతున్నది. ఆమెలో క్రోధం, ఉద్రేకం ఉట్టిపడుతున్నవి. ఆమె తన పమిటను గట్టిగా నడుముకు బిగించింది. నడుముకు పెద్దకత్తి ఒకటి వేలాడుతున్నది. అవమానిత ఫణిరాజమువలె బుసలు కొట్టుచున్నది. దీర్ఘ శిరోజములను విరబోసుకొని అపర చండికవలె ప్రకాశిస్తున్నది.

ఆలోచనా తరంగములలో తేలియాడుచూ, "ఛీ ... కులపాంసుడు, దేశద్రోహి, ధర్మద్రోహి శక్తినితాకి అపవిత్రురాలనయ్యాను. ఆనరాధముని ప్రేమించి నా వంశానికి తీరనికళంక మాపాదించాను. ఈ మచ్చను బాపుకోటం ఎట్లా ? ఈ పాపంనుంచి విముక్తి పొందటం ఎట్లా ?

ఆ ... నా శరీరాన్ని తాకిన పాపానికి, దానిని యీ కత్తికే బలియిస్తాను. ఆ రక్తంతో భారత మాత పాదపంకజాలను అర్చించి ధన్యత చెందుతాను.

ఈ జన్మకు ప్రేమలేదు, దాంపత్యంలేదు. ఆ దేశద్రోహిని పతిగా స్వీకరించి నాకు, నా తండ్రికి, మహారాణాకు, భారతాంబకు ద్రోహంచెయ్యను. ఈ జన్మలో ఆజన్మ బ్రహ్మచారిణిగానైనా ఉంటాను గాని, ఆ నీచుని భర్తగా స్వీకరించకూడదు.

రమ హేళనగా నవ్వుతూ, "ఆ మూర్ఖుడు ... శక్తి, భారత స్త్రీ అంటే వారాంగన అనుకున్నాడు. కామానికి దాసురాలననుకున్నాడు. శరీరానిని నీచులకమ్ముకుంటుందనుకున్నాడు.

ఇంక తెలుసుకుంటాడు! స్త్రీ సాహసమూర్తని, రణచండికని, త్రిపురాసురమర్దని అని ... దేశ ద్రోహిని శిక్షించి, ధర్మాన్ని కాపాడవలసిందే."

ఇంతలో ఆలోచనా కెరటాలను భగ్నంచేసింది ఒకశబ్దం. రమ కత్తిదీసుకొని గబగబ అలికిడివచ్చినవైపు అంగలేస్తూ వెళ్ళింది. మేడమెట్లు ఎక్కుతున్నాడు ఒక విలాస పురుషుడు కత్తిని వయ్యారంగా త్రిప్పుకుంటూ.

రమ ఎదురుగా వెళ్ళింది. 'ఆగు. ఎవరు నీవు' అని గదమాయించి అడిగింది.

'నేనే రమ ... నీ ప్రియుణ్ని ... శక్తిని' అన్నాడు విలాసంగా.

రమ ఉలిక్కిపడ్డది. రక్తం గడ్డకట్టింది. కొద్ది క్షణాలలో తేరుకుంది. సాహసం చిక్కబట్టింది.

"ఎవరు నీవు ... నా ప్రియుడివా ... దుర్మార్గా ... నా ప్రియుడనంటున్నావుగా-నాప్రియుడు రాజర్షి ప్రతాపునితో తగవులాడినప్పుడే చచ్చిపోయ్యాడు" అన్నది వెటకారంగా తిరస్కార భావంతో. ఆమెకళ్ళు నెళ్ళగక్కుతున్న ప్రచండ తీక్ష్ణకాంతులు అగ్నిగోళాలులాగా తారాజువ్వలలాగా శక్తిసింహుని ఎదుర్కొన్నవి. శక్తిసింహుడు నిర్ఘాంత పొయ్యాడు. పిడుగువంటి మాటలవిని నిశ్చేష్టుడయ్యాడు. నోటివెంబడి మాట పెగలటంలేదు. అసంఖ్య శత్రువాహినుల నవలీలగా నెదుర్కొను శక్తికి, రమ రణచండికగా, అజేయగా కనుపించింది.

రమ దూసిన కత్తితో సమీపిస్తున్నది. శక్తి కొయ్యబారిన బొమ్మలాగా నిలుచున్నచోట గుడ్లు మిటకరిస్తూ నిలబడ్డాడు. చివరకు ధైర్యం తెచ్చుకొని, దీనంగా 'రమా నేను నీ బావనుగదూ! ఇంతలోనే మరచిపొయ్యావా నీ చరణ చారణ చక్రవర్తిని' కండ్లవెంట నీరు గ్రమ్మింది. స్వరం గద్గదికమయింది శక్తికి.

శక్తిని అనుకోకుండాచూచి రమ ఆశ్చర్యచకితయైనది. అతని దీనవచనాలనువిని తనకు తెలియకుండానే శాంతించింది. కోపం జారిపోయింది. కత్తిని ఒరలో దూర్చింది. తలవంచుకొన్నది. ప్రేమప్రవాహము పెల్లుబికింది. ప్రియుడు దీనంగా అర్థిస్తున్నాడే అనేచింత మెరుపువలె మెరిసింది. తన ప్రియుని నిరాకరిస్తూన్నాననే శంక కలిగింది. చిత్తం డోలాయమానస్థితిలోపడ్డది.

ఒకడుగు వెనుకకు వేసింది. అంతరాత్మ సింహగర్జన చేసింది. తప్పటడుగు వేస్తున్నావని కొరడాతో కొట్టినట్లనిపించింది. నీచత్వానికి లొంగిపోతున్నావని హెచ్చరించింది. శరీరం యావత్తు గగుర్పాటు చెందింది. ఇదంతా క్షణాలలో జరిగిపోతున్నది. రమ నిలవత్రొక్కుకున్నది. తన మనస్సును తన స్వాధీనంచేసుకుంది. దయాదాక్షిణ్యాలకు, ప్రేమానురాగాలకు స్వస్తి చెప్పింది. ఈ మారు జీవితంలో భీష్మ నిర్ణయం చేసుకున్నట్లు ఆత్మవిశ్వాసాన్ని పొందింది. పొరపాటున జీవితంలో యీ సమయంలో త్రొట్రుపాటుపడితే అథఃపాతాళ లోకానికి ఈడ్చుకెళ్ళే భయంకర సుడిగుండాలెన్నో ఆమె పాదాలక్రింద తారట్లాడుతున్నట్లు గ్రహించింది. హృదయాన్ని పాషాణ సదృశం చేసుకున్నది. పూర్వస్థితిని కొద్దికాలంలోనే పొందింది.

కళ్ళెర్రచేసి చింతనిప్పులు కురిపిస్తూ, "శక్తీ! నీ పేరుచ్చరించటంకూడా పాపమే. భారతభాగ్య విధాతను దొంగచాటుగా డొక్కలో పొడిచావు. ద్రోహంచేశావు. భారతమాత గౌరవాన్ని మంటగలిపావు. నా వంశానికి నీ వంశానికి తీరని కళంకం తెచ్చావు. గంగగోవువంటి వీరాబాయి కడుపున చెడబుట్టావు. పవిత్ర శిశోదియా తులసీ వనంలో గంజాయి మొక్కవు నీవు ... నీ మొగం చూచినా పాపమే. ఫో ... నీతో ఇంక మాట్లాడినా పాపమే ... అక్బరు దగ్గరికెళ్ళి ఏదో బీబీని అంటగట్టుకో."

శూలాలలాంటి యీ మాటలనువిని శక్తి నిర్వీర్యుడై అంజలి ఘటిస్తూ, "రమా! నీ ప్రేమభిక్ష అర్థించటానికేవచ్చాను. నీవులేనిది నేను బ్రతకటంకల్ల."

"ఛీ! నరాధమా ... రమంటే తుచ్ఛకామాన్ని ఆశించే వారాంగన అనుకున్నావా. రమ తన జీవితాన్ని దేశమాత కంకితంచేసింది. నైవేద్యంపెట్టిన అన్నాన్ని ముట్టుకోకూడదని శునకానికేం తెలుస్తుంది. మృతప్రాయుడైన శక్తిని పరిగ్రహించే కులటగాదు. ఇంకవచ్చిన దారిబట్టు ... ఇంక వెళ్ళిపో ..." అని అచ్చటినుంచిలేచి మేడమెట్లుదిగి వెళ్ళిపోతున్నది.

"రమా ... రమా ... ఆగు ... నా ప్రార్థనవిను. తానంతటతావచ్చిన ప్రియుడ్ని తిరస్కరించకు. నీవిచ్చినమాట మరచిపోయావు. అన్నతో తగవులాడింది నిన్ను చిత్తూర్ మహారాణిని చేయవలెననే. స్వర్గసౌఖ్యాల ననుభవించవలెననే" అని కొనఆశతో రమలో భోగకాంక్షను రేగగొట్టుదామనే పాచిక వేశాడు కామపీడితుడు శక్తిసింహుడు.

రమ గిరుక్కున వెనక్కుతిరిగి అసహ్యభావంతో "ఇంక నీ మాటలు కట్టిపెట్టు. నీకు సిగ్గులేదూ! నన్ను వంచించటానికి. నీ సౌందర్యాన్నిచూచి, నీ శూరత్వాన్నిచూచి వరించాననుకున్నావా వ్యర్థుడా! మహారాణా పవిత్ర ఆదర్శమే, స్వాతంత్ర్యమనే ఆశాపాశమే మనల నిద్దరిని కలిపింది. స్వాతంత్ర సమరంలో ఉత్తమోత్తమ సమిధల మవుతామని కలలుగన్నాము. ఈనాడో ఆ పవిత్రబంధం తెగిపోయింది. దేశద్రోహిని, భాతృద్రోహిని, ధర్మనాశకునిచేపట్టి భారతదేశ చరిత్రను కళంకం చెయ్యదలచుకోలేదు. నా ఆశవదలుకో."

"రమా! నేనూరుకుంటున్నకొద్ది అనవసరంగా మాట్లాడుతున్నావు. నీమీదున్నప్రేమవల్ల నీవన్న మాటలు సరకుచేయటంలేదు. చిత్తూర్ మహారాణి కాగలుగు అదృష్టం నీ మొహాన లేదు ... ఇంక నేను వెళ్ళుతున్నాను" అని కోపంతో వెనక్కుతిరిగాడు.

"శక్తీ! చిత్తూర్ మహారాణా వవుదువని ఊవ్విళ్ళూరుతున్నావే. నాబొందిలో ప్రాణాలున్నంత వరకు, మేవాడ్ రాజపుత్ర వీరులలో పసికందైన బ్రతికినంతవరకు దేశద్రోహి బాప్పారావల్ సింహాసన మధిష్ఠించలేడు. అంతేకాదు, యీరమ సామాన్యవనిత అనుకున్నావా. దేశద్రోహాన్ని తుదముట్టించే పరాశక్తి యీరమ. మహిషాసురుని మర్ధించి ధర్మప్రతిష్ఠాపనజేసిన మహాశక్తియని గుర్తుంచుకో. ఇంక వెళ్ళు..." అని గబగబ కోపంకొద్ది మేడమెట్లుదిగింది.

శక్తిసింహుని కేమనాలో, ఏమనకూడదో తెలియని అయోమయస్థితిలోపడ్డాడు. భుగభుగ పొగలు గ్రక్కుతున్న అగ్నిపర్వతాన్ని తాకటానికే సాహసించలేకపోయాడు. రమమీదనున్న ఆశాపాశాన్ని కోసివేసుకోలేక, ఆమెవెంటనే మెల్లిగా మెట్లుదిగుతూ, "రమా! ఇంక శెలవు. మనిద్దరికి కలిసేయోగ్యత లేదు..."

రమ క్రోధావేశంతో మాట్లాడుతున్నను ఆమెలోని స్త్రీ మార్దవహృదయం నసించలేదు. ఆమె కనులనుండి నీరు పుష్కరిణీవలె పొంగినవి. విచారంతో 'శక్తీ, ఇంక త్వరపడివెళ్ళు. మాతండ్రి నీరాక తెలుసుకొనినచో నీ బొందిలో ప్రాణాలుండటంకల్ల. భగవంతుడు నీ హృదయాన్ని మార్చినచో అప్పుడే మనపునఃసమాగమము, ఇంక శెలవిమ్ము' అని కన్నీటి బిందువులు రాల్చుచు ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఇక రమ చేతికందని స్వర్గం. దూరాన మెరిసే ఎండమావి. నిరాశచేసుకొని, ఉత్సాహంనసించి, తీవ్ర సాకారంవల్లగల్గిన పరాభవాగ్ని దహిస్తుంటే, అడుగులలో అడుగులు వేసుకుంటూ పేలవంగా నడచిపోయ్యాడు.

అతడు వెళ్ళిపోవటం రమచూస్తునేవున్నది. దుఃఖం కట్టలు తెగిపొర్లింది. మోకాళ్ళమీద తలనానించి వెక్కి వెక్కి ఏడ్చింది. మళ్ళీ శక్తిని పిలుద్దామా అని ప్రలోభపెట్టింది మనస్సు, కాని 'వద్దువద్దు' అని ఆశాపాశాన్ని కోసివేసింది అంతరాత్మ.

ꭗ

నాల్గుసంవత్సరములు గడచినవి. రమ ఆహారనిద్రలను మానినందున చిక్కిశల్యమయింది. తండ్రి అనుజ్ఞతీసుకొని రాజర్షి భార్య పాటేశ్వరీదేవిని సేవించి ధన్యనవుదామని వెళ్ళింది. మహారాణాకు రాజ్యం పోయింది. అన్ని యుద్ధాలలో పరాజయమేకల్గింది. అడవులుపట్టి అష్టకష్టాలుపడుతున్నారు.

హాల్దిఘాట్ యుద్ధంజరిగింది. ఇదేచివర యుద్ధమని ప్రతాప్ మొండి ధైర్యంతో పోరాడాడు. అసంఖ్యాక శత్రువాహినులను చీకాకు పరిచాడు. అయినా పరాజయమేకలిగింది. పరాజితుడై అతిదీన స్థితిలోనున్న అన్నను చూచాడు శక్తిసింహుడు. అతని కఠిన హృదయం ద్రవించింది. ప్రతాప్ కాళ్ళమీద బడి క్షమించమని ప్రార్థించాడు. ప్రాధేయపడ్డ తమ్ముని లేవదీసి కౌగలించుకున్నాడు రాజర్షి ఆనంద బాష్పాలతో.

అగ్బరుకీ విషయం తెలిసింది. తన కొలువువదలి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. శక్తి అన్నను చేరాడు. అన్నదమ్ములిద్దరు కోటవెంట కోట 24 కోటలను జయించారు. 'మహారాణా ప్రతాప్‌కీజై' అనే శబ్దం రాజపుత్రస్థానం అంతా మార్మోగింది. అగ్బరు పరాజయం అంగీకరించాడు.

శక్తిసింహుడు అన్నను జేరాడు అనివిన్న రమకు ఆనందానికి అంతులేదు. కుమల్‌మియర్ దుర్గానికి వస్తున్న అన్నదమ్ములకు స్వాగతం ఏర్పాటు చేసింది. ప్రతాప్ శక్తిసింహుల, కీర్తి గానంచేస్తూ సైన్యాలు ప్రవేశించినాయి. రాజపుత్ర స్త్రీలు మంగళనీరాజనాలిచ్చారు, పూలు విరజిమ్మారు, పన్నీరు చల్లారు.

సింహద్వారంవద్ద ప్రతాప్ శక్తిసింహులకొరకు, వేచివున్నారు పాటేశ్వరీ రమాదేవులు. పాటేశ్వరీ తనపతికి మంగళ నీరాజనాలనిచ్చి తన మందిరంలోనికి తీసికెళ్ళింది.

రమ తన మనోహరునికి చందనమద్ది, తిలకందిద్ది 'క్షమించవా, బావా' అని పాదాలమీద స్మృతిదప్పి పడిపోయింది. శక్తి ఆమెకు శీతలోపచారాలొనర్చి తెలివిరాగానే 'క్షమించవలసింది నీవే రమా' అని ఆమెను తన కౌగిలిలోనికి చేర్చుకున్నాడు. ఆరుసంవత్సరాల ఎడబాటు ననుభవించిన ఆ పవిత్ర ప్రేమికులు చిరవాంఛిత కౌగిలిలో పెనవేసుకొని స్వర్గలోక సౌఖ్యాల నన్నిటిని ఒక్క క్షణంలోనే అనుభవించారు.

విజేత మహారాణా ప్రతాప్ రమాశక్తుల వివాహం కన్నుల పండువుగా జేసాడు. రాజపుత్ర లోకమంతా నవదంపతులను నాశీర్వదించారు. వృద్ధదంపతులు కృష్ణసింహ ముక్తాబాయిలు ఆనంద సముద్రంలో తేలియాడారు. అగ్బరుపాదుషా సహితం అమూల్యకానుకలనుపంపి తన శ్రద్ధాంజలి ఘటించాడు.

——o——



# మామిడి



## మామిడి పండ్ల హల్వా

బాగుగా పండిన అంటుమామిడి పండ్లను ముప్పదితెచ్చి మంచినీళ్ళలో ఒకఝాము కాలము నానబెట్టి యుంచవలెను. తరువాత పైచెక్కును తీసి సన్నని ముక్కలుగా కోసి కళాయి పళ్ళెములో నుంచవలెను. తరువాత శేరున్నర నేతిలో రెండుశేర్ల గోధుమపిండిని వేయించి ఒకచోట పెట్టుకొనవలెను. నలుబది తులముల కిసిమిసిపండ్లను నీటిలో కడిగి పరిశుభ్రము చేసి పొడిగుడ్డలో పెట్టి ఆరపెట్టవలెను. గింజలు తీసినటువంటి యిరువది తులముల ఖర్జూరపండ్లను ముక్కలుగా జేయవలెను. ఇరువది తులముల పిస్తాపప్పు, యిరువది తులముల బాదమపప్పు, నానబోసి నేతిలో వేయించి పొడిచేసినది, అర్ధశేరు శనగపప్పు పిండియు, రెండుతులముల దాల్చినచెక్క పొడియు, నాలుగు తులముల యాలకుల పొడియు (కావలసిన వారు రెండుతులముల సోపుపొడియు కలుపుకొనవచ్చును) వీటినన్నిటిని, నేతితో వేయించిన రెండుశేర్ల గోధుమపిండిలో కలుపవలెను. తరువాత నమ్మకమైనటువంటి ఒక శేరుపాలు సంపాదించి పొయ్యిమీద పెట్టి సలసల క్రాగుటచూచి ఆ గోధుమపిండిని వేసి, అర్ధశేరు నేతిని ధారగాపోసి కలుపుతూ సిద్ధముగానుండిన మామిడిపండ్ల ముక్కలను వేయవలెను. ఇవి యన్నియు బాగుగా పక్వమైన తరువాత నలుబది తులముల చక్కెరను కలిపి, అర్ధశేరు పెసరపిండికూడ వేసి బాగుగా కలియబెట్టుచు అర్ధశేరు నేతిని మరలపోసి దించవలెను. ఈ విధముగా పాకము తయారైన తరువాత దించి బాగుగా ఆరిన తదుపరి ఒకతులము బాదముపప్పు తునకలను, రెండు తులముల దాచెనచెక్క పొడియుచల్లి భుజింపవలయును. ఈ హల్వాను గాలి తగిలేటి చోట్లనుంచి యిరువది దినములవరకు వాడుకొనవచ్చును. ఇది శరీరమునకు మంచి ఆరోగ్యమొసంగి సమస్త వాతములను పోగొట్టును. ధాతుపుష్టిని కలుగజేయును, బాలురకు బాగుగా బుద్ధిని ప్రకాశింపజేసి బలమునిచ్చును.

## మామిడి వరుగు చారు

రెండుశేర్లు నీళ్ళుపట్టే కళాయిపాత్రలో, శేరుంబావు మంచినీళ్ళుపోసి పొయ్యిమీద కాచవలెను. పురుగుపట్టినది, కుళ్ళి వాసనకలది ఉపయోగించక, మంచిదైన నాలుగు తులముల మామిడివరుగు దెచ్చి కాగుచున్న నీటిలో వేసి మూతపెట్టవలెను. అరతులము మిరియాలపొడి, రెండు అణాలయెత్తుగల మిరపకాయలపొడి, ఒక తులము ఉప్పు యీ మూడింటిని పొయ్యిమీద వుడుకుచున్న చారులో వేయవలెను. ఒక గరిటెలో తులము నెయ్యివేసి నిప్పులుమీద కాగుచుండగా ఒకతులము మినపప్పు, వేయించవలెను, వేగినపప్పులో రెండుతులముల కొబ్బరినూరువేసి, యీ రెండు పదార్థములను నీళ్ళు చల్లుతూ నూరి, ఆ నీటిని చారులో పోయవలెను. ఒక తులము నెయ్యి గరిటలో వేసి, తొడిమెలుతీసి ముక్కలుగా చేసిన మిరపకాయలను పావుతులము వేసి పొయ్యిమీదపెట్టి వేయించవలెను. మిరపకాయలు సగభాగము వేగినతరువాత అరతులము మినపప్పు వేయవలెను. ఇది రెండుపాళ్ళు వేగినతరువాత, పావుతులము ఆవాలు వేసి వేగుటచూచి అరతులము శనగపప్పు వేయవలెను. తిరుగబోత పక్వమైన తరువాత చారులో కలిపి మూతపెట్టి దించుకోవలెను. రెండుతులముల నీళ్ళలో ఒక అణాయెత్తు యింగువవేసి ఆ తేటను చారులో పోయవలెను.

## మామిడికాయ చిత్రాన్నము

మంచి వాసనగలపంటి సన్నని పాతబియ్యము ఒక శేరు తెచ్చి, పువ్వులవలె అన్నము తయారుచేసి కళాయి పాత్రలో వేయవలెను. మిరపకాయలు ఒకతులము, ఆవాలు రెండు తులములు, కొబ్బరికోరు పదితులములు, అరతులము పసుపుపొడి, మూడుతులములు ఉప్పుపొడి, వీటిని రోటిలో కొంచెము కొంచెముగా నీళ్ళుచల్లుతూ చక్కగా దంచి కళాయి పాత్రలోనున్న అన్నములో వేసి కలుపవలెను. పన్నెండు మామిడి కాయలయొక్క తొడిమలు, పైచెక్కును తీసివేసి టెంకెలు పారవేసి సన్నగా తురిమి అన్నములో కలుపవలెను. ఒక శేరు మంచినూనె గాని, నెయ్యిగాని, అయిదు శేర్లు నీళ్ళుపట్టు కళాయి పాత్రలో పోసి పొయ్యిమీద పెట్టవలెను. కాగుతూయున్న నేతిలో, తొడిమెలుతీసి సన్నగా తుంచిన ఒకతులము మిరపకాయలను వేయవలెను. మిరపకాయలు రెండుపాళ్ళు వేగినతరువాత, రెండుతులములు, మినపప్పును వేయవలెను. అది అర్ధభాగము వేగినపిమ్మట తులమున్నర ఆవాలు వేయవలెను. ఆవాలు బాగా పక్వమైనంతనే రెండు తులములు శనగపప్పు వేయవలెను. రెండు అణాలయెత్తు యింగువను పొడిచేసి ఆ తిరుగబోతలో వేసినతోడనే సిద్ధముగానున్న అన్నమును వేసి గరిటెకాడతో బాగుగా కలిపి మూతపెట్టి పొయ్యిక్రింద మంట తీసివేసిన నిప్పులమీద మూడు నాలుగు నిమిషములుంచి క్రిందికి దింపుకోవలెను.

వాశిరెడ్డి సుశీలాదేవి.

—(o)—

# ఆడ బ్రతుకు



శ్రీమతి తూములూరి కృష్ణవేణి

"దుర్గా, దుర్గా" అని కేకలేశాడు ప్రసాద్. కాని, లోపలనుంచి జవాబులేదు. రాత్రంతా డ్యూటీ చేసి అసలే విసుకుగానున్నాడు. అందులో పనివాళ్లంతా సమ్మె చేశారు. తనూ, వాళ్లతోపాటు సమ్మె చేయకపోతే యిబ్బంది. వెళ్లకుండావుంటే జీతం రాదు. ఈఆలోచనలతో అతనిబుర్ర తిరుగుతున్నది.

ఎప్పుడూ నైట్ డ్యూటీకెళ్లినా ఉదయం 6 గంటల్లకే యింటికివచ్చి తలుపుతట్టగానే నిద్రకళ్లతో, కప్పుకున్న దుప్పటితోసహా వచ్చి, తలుపుతీసి యెంతో ఆప్యాయంగా పలుకరించేది భార్య. కాని ఈ రోజు ఎంత పెద్దగాపిలిచినా, తలుపు చప్పుడుగాని, లోపలనుండిగాని జవాబు, వస్తున్న అలికిడిగానిలేదు. తలుపును కాలితోతన్ని పెద్దగా కేకవేశాడు ప్రసాద్.

"ఒయ్...వస్తున్నా, యేమిటాగోల" అంటూ గొళ్లెంతీసి దొడ్లోకి వెళ్లిపోయింది.

ప్రసాద్ గుడ్డలు మార్చుకొని కాళ్లు కడుక్కోటానికి దొడ్లోకివెళ్ళాడు. దొడ్లో బాదంచెట్టుక్రింద, పొడుగాటి వాలుజెడ ముందుకు పడుతూవుంటే, పమిటె నడుము చుట్టూబిగించి, తోమిన అంట్లను కడుగుతున్నది దుర్గ.

"నీవు తోముతున్నావేం! పనిమనిషిరాలేదా?" అన్నాడు ప్రసాద్.

"పనివాళ్లంతా సమ్మెచేస్తారట. వాళ్లకుతప్పినా నాకుతప్పేదేముంది. పడివున్నానుగా కూలిదానిలాగా చాకిరి చేయటానికి" అని విసుగ్గా అన్నది దుర్గ.

"యింట్లో కొంచెముపని యెక్కువయితే అంతవిసుగు దేనికి. రాత్రంతా నిద్రలేక పనిచేసినవాణ్ణి నేనేమనుకోవాలి. పనివాళ్లంతా సమ్మెచేశారు. వాళ్లతోపాటు నేనూ చేసితీరాలి. వెళ్లితే, వాళ్లతో తంటా.... వెళ్లకపోతే మన కడుపులో మంటా.... యీ పరిస్థితిలో నాకెల్లాగుండాలి చెప్పు దుర్గా."

"మీకేం అలాగేఅంటారు. పగలస్తమానం బండచాకిరీ చేస్తూ - పైగా మీరు వచ్చేసరికి స్నానానికి నీళ్లదగ్గరనుండి, భోజనానంతరం కిళ్ళీదాకా రెడీగావుంచాలి. ఇందులో నేలోపమయినా, చిక్కేగదా? యింట్లో భార్యను ఒక దాసీదానిక్రింద కట్టేస్తున్నారు మీ మగవాళ్లు."

"అసలే నామనసు చికాగ్గావుంది దుర్గా. నీ మాటలతోనన్ను వేధించక ఇన్ని కాఫీనీళ్లన్నా యివ్వు"

దుర్గ మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళింది. ఆమె కాపరానికి వచ్చినప్పటినుండి భర్తతో నీవిధంగా విసుగ్గా నెన్నడూ మాట్లాడలేదు. ప్రక్కయింట్లోకి క్రొత్తగా అద్దెకువచ్చిన 'మహిళాసంఘం అధ్యక్షురాలి ఉద్బోధకాబోలు,' అనుకున్నాడు ప్రసాద్.

"ఏమండోయ్! బజారుకెళ్ళి పాలు తీసుకురావాలి. పాలవాళ్ళుకూడా మూడు రోజులుసమ్మె చేస్తారుట. యివ్వాళ పాలవాడురాలా" అని వంటయింట్లోనుండే కేక లేసింది దుర్గ. "ఆహా! ఎక్కడచూచినా సమ్మెలే - నీవుకూడా సమ్మె చేయాలనుకోవడం లేదుకదా?" అన్నాడు ప్రసాద్, వంటింట్లోకివచ్చి కూర్చొని.

"పాకీవాళ్ళదగ్గరనుండి పెద్ద ఆఫీసర్లదాకా సమ్మె చేస్తూయుంటే, ఆడవాళ్ళుఅంత అసమర్థులనేనా, మీ అభిప్రాయం. మేమూ చేయదలచుకున్నాము."

"మీరు సమ్మెచేయడం దేనికి?" అన్నాడు. "దేనికా మీరు మమ్మల్ని మరీ మరీ హీనంగా చూస్తున్నారు. పెద్దచదువులు చదివి, వుద్యోగాలుచేసే స్త్రీలు స్వతంత్రంగా స్వేచ్ఛగా నుంటున్నారుకాని, మాబోటి గృహలక్ష్ములకు చదువు సంధ్యలనే సమస్య లేకుండా, కూపస్థ మండూకములవలె తయారుచేశారు. స్త్రీ అంటే బయటి ప్రపంచం నుండి, వంటయింట్లోకి విసిరిపారేసిన యంత్రమని మీ యుద్దేశ్యంకాబోలు" అన్నది దుర్గ తీవ్రంగానే.

"అయితే మిమ్మల్ని పురుషులు గౌరవించ లేదంటావా ? ఎక్కడచూచినా మీ ఆడవాళ్ళ ఫొటోలే! యే పత్రికలమీద చూచినా మీముఖ చిత్రాలే ఇంకాఏమి కావాలి!" అన్నాడు ప్రసాద్.

"చాల్లెద్దురూ! ప్రతిసినిమా పత్రికలమీదా ఆడవాళ్ళ అర్ధనగ్న చిత్రాలన్నీ వేసి మా భారత స్త్రీల గౌరవం చెడగొట్టుతున్నారు.

అదికాక సినిమాయాక్ట్రర్లకూ, పెద్ద చదువులు చదివి, యుద్యోగాలు చేసేస్త్రీల కున్నంతగౌరవం, మా మధ్యతరగతి సంసార స్త్రీలకు లేదు. గృహనిర్వాహణ బాధ్యత స్త్రీకి, ద్రవ్యార్జన పురుషుడికి. ఇది మనహిందూ సాంప్రదాయంలో పూర్వంనుండే వస్తున్న రివాజేగా. భార్యభర్తలు కుటుంబ నిర్వాహణలో సమానులే. పూర్వపు ఆ యుద్దేశ్యాలుపోయి, "పోషించేవాడు పోషింపబడేది" అనేభావం మీలో పాతుకుపోయింది. కుటుంబ నిర్వాహణ, పిల్లలపోషణ, గృహకృత్యాలూ, ఇవి బండచాకిరిగాను, ఆఫీసుకెళ్ళి దర్జాగా కుర్చీలమీద కూర్చొని చేసేవి వుద్యోగాలు కాబోలు! తనయిల్లూ, భర్తా, పిల్లలూ, సంసారం అంతాతన అనే వెర్రిప్రేమతో ఎన్నికష్టాలకయినా ఓర్చి ఆనందంగా గృహాన్ని చక్కదిద్దుకొనే గృహలక్ష్ములను చూస్తే, మీకింత నిరసనదేనికి? వనితాజనాన్ని

పీడించే పురుషుల దౌర్జన్యాలను నిర్మూలించాలి. అందుకే మా మహిళాసంఘం మంతా సమ్మెచేయ దలచుకొన్నాం."

"సెహబాష్ - దుర్గాదేవిగారూ!! మీ వుపన్యాసం అమోఘంగాయుంది. అయితే నా గతి అధోగతేనా? గృహలక్ష్ములంతా యేకమవుతారు కాబోలు." అన్నాడు ప్రసాద్.

'అబ్బ మీతో మాట్లాడ్డం నాదే తప్పు, చూస్తారుగా ముందు - ముందు మీకే తెలుస్తుంది" అని కూర తరుగుతూ కూర్చుంది దుర్గ కోపంగా.

ఆమెకు బాగా కోపమొచ్చిందని తెలుసుకున్నాడు ప్రసాద్. కోపం పోగొట్టా లన్న వుద్దేశ్యంతో.

"దుర్గా. ఈరోజు ఆదివారంకదూ? మ్యాట్నీ సినిమా కెళదాం సిద్ధంగా వుండు? ఏం! ... ఇవాళ యేంకూర చేస్తున్నావ్. భలే కమ్మటి వాసన వేస్తున్నది తిరుగమాత."

దుర్గ మాట్లాడకుండానే కూర తిరుగమాతలో వేస్తున్నది - 'దుర్గను మాట్లా డించటం యెలాగా' అని ఆలోచిస్తున్నాడు ప్రసాద్.

"ఓహో! అప్పుడే సమ్మె ప్రారంభమయినట్లుందే? మాటలుకూడా ఆగి పోయినయ్?"

"ఏమిటండీమరీ, యేమాట మాట్లాడినా అలా హేళన చేస్తారు" నవ్వుతూఅంది.

"లేదు దుర్గా - అసలు విషయమేమిటో చెప్పు"

"ఏం చెప్పమంటారు? పురుషులకున్నంత స్వాతంత్ర్య స్వేచ్ఛలు స్త్రీల కెందు కుండకూడదు? స్త్రీ స్వాతంత్ర్యముకొరకు మా మహిళాసంఘములు కృషిచేయక తప్పదు."

"సరేలే, ముందు నా సంగతి కొంచెంచూడు - స్నానానికి వేడినీళ్లుతోడు. ఆకలేస్తున్నది. భోజనంచేసి, కాస్త నిద్రపోవాలి. రాత్రంతా నిద్రలేదు."

ప్రసాద్ భోజనంచేసి, గదిలోకివెళ్లి - పడక కుర్చీలో నడుంవాల్చాడు. దుర్గ కూడా భోజనంచేసి ముస్తాబయి,

"ఏమండోయ్, నేను ప్రక్కవాళ్లింటి కెళుతున్నా; తలుపులన్నీ తీసేయున్నయ్ జాగ్రత్త" అంటూ వెళ్లిపోయింది.

పడక కుర్చీలో పడుకొని గుర్రుకొడుతున్నాడు ప్రసాద్.

ఆ సభ అప్పుడే ప్రారంభమయింది. యెందరో వనితలు ఒకరినొకరు త్రోసుకుంటూ, బిర - బిర లోనికి వెళుతున్నారు.

"స్వతంత్ర మహిళా సమ్మేళనము"

"స్త్రీ లోకాని కంతటికీ సుస్వాగతము."

ఇత్యాది వాక్యాలతో ఆతోరణాలు గాలిలో రెపరెపలాడుతున్నయ్ - మైదానమంతా లైట్లకాంతితో వెలుగుతున్నది. మధ్యనొక ఎత్తయిన వేదిక. నలుప్రక్కలా అరటి స్తంభాలు పూలకుండీలు. అవన్నీ అలాగ ఏర్పరచినవారి కళానైపుణ్యాన్ని మెచ్చుకుంటూ, ప్రసాద్ సభా ప్రవేశ ద్వారంవద్ద నిల్చొని యున్నాడు.

"శోభ తెచ్చేది, శృంగార మొలికించేది, పువ్వులూ - పూబోణులే!" అని పెద్దలూరికే అన్నారా? యెవరేమన్నా సరేగాని ఆడది లేనిచోట అందముండదు. అది నిజంగా ఒక ప్రమదావనమే. ఈ రకంగా ఆలోచిస్తూ నిలుచున్నాడు. ఇంతలో సభ ప్రారంభమయింది. "ఏంటయ్యా ఇది ఆడవాళ్లసభ అని తెలీదూ? వెళ్ళు వెళ్లు" అని లోపలికి వెళ్లుతున్న ఒక స్త్రీ ప్రసాద్‌ను కసురుకుంది. అట్టి అవమానమును సహించలేక గుట్టు చక్కగా ఇంటిదారి పట్టినట్లు, ప్రసాద్ కలగంటున్నాడు.

"ఏమిటండీ! అలా నోరు తెరుచుకుని పడుకొని గుర్రుకొడుతున్నారు?" అంటూ ప్రసాద్ చెయ్యిపట్టుకొని యూంపుతూ లేపింది దుర్గ. ప్రసాద్ ఉలిక్కిపడిలేచి "ఆ! ఆ! నీవు మహిళా సంఘంలో నున్నావ్ కదూ? ఎప్పుడొచ్చావ్?" అని అన్నాడు ప్రసాద్.

"భలేవారేలెండి. మంచికలే కన్నారు!" ఆ రోజంతా పగటి సంగతులతోనే కాలంగడిపారు. ఇప్పుడు దుర్గ మహిళాసంఘ సభ్యురాలయింది. సమావేశములకని - వుపన్యాసములకని, అప్పుడప్పుడూ వెళుతుండేది.

ఆ రోజు ఆదివారం ప్రసాద్ ఇంట్లోనే వున్నాడు, దుర్గయేదో వుపన్యాసానికెళ్లి కొంచెం ఆలస్యంగా ఇంటికొచ్చింది.

"దుర్గా ఇంత ఆలస్యంగా వచ్చావేం, కాఫీ కాస్తుంటే చెయ్యికాలింది" అన్నాడు ప్రసాద్.

"నీవు లేకపోయినా వంటచెయ్యగలనని యెప్పుడూ కోతలు కోసేవారే! మరి" నవ్వుతూ అంది దుర్గ.

"ఆ - యెంతయినా, గృహానికి వన్నె తెచ్చేది గృహలక్ష్మే కదూ?"

—(౦)—

# నైపుణ్యంగల వృత్తులలో సోవియట్ స్త్రీలు

ఎన్నా ఓలిట్

---

రాజ్యాంగం తమకు ప్రసాదించిన రాజకీయ హక్కులను సోవియట్ స్త్రీలు పూర్తిగా వినియోగించుకుంటున్నారు. 1929 లో పరిశ్రమలలోనూ, నిర్మాణంలోనూ 3,300,000 మంది స్త్రీలు మాత్రమే పనిచేసేవారు. కాని యుద్ధానికి ముందు 1940 లో పరిశ్రమల్లోనూ, రవాణాలోనూ, నిర్మాణంలోనూ కోటీ 10 లక్షలమందికిపైగా స్త్రీలు పనిచేస్తూండేవారు. సోవియట్ సమాజంలోనూ, జాతీయ ఆర్థిక రంగంలోనూ కార్మిక స్త్రీల కృషి ఏడాదికేడాది ఎక్కువవుతూంది.

నిజమైన ప్రజాతంత్ర ప్రజాస్వామ్య వ్యవస్థ అయిన సోవియట్ వ్యవస్థ నిర్మాణాత్మకమైన సాంఘిక కృషిలోనికి అనేకమంది స్త్రీలను తీసుకొచ్చింది. స్త్రీలు తమ జ్ఞానాన్నీ, నైపుణ్యాన్నీ పెంపొందించుకోవడానికీ అపారమైన అవకాశాలివ్వబడ్డాయి. సమానమైన పనికి స్త్రీలు పురుషులతో సమానంగానే జీతం పుచ్చుకొంటారు.

అధికమవుతూన్న శిశుపోషణాలయాలయొక్క ప్రయోజనాలనూ, తల్లీపిల్లల శ్రేయస్సుకు ప్రభుత్వమిచ్చే రక్షణనూ, అనుభవించే తల్లిపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపబడుతూంది.

ఇదంతాకూడా స్త్రీల సమానత్వానికి హామీయిస్తూ, దానికి వొకబలమైన పునాదిని సృష్టించింది.

సోవియట్ దేశంలో సుమారు 6000 లకు పైగా స్త్రీల ఆరోగ్య కేంద్రాలూ, 18,500 శాశ్వత శిశుపోషణాలయాలు, 3500 లకు పైగా క్షీరశాలలూ వున్నాయి. ప్రభుత్వ యాజమాన్యంకింద 6000 ప్రసూతి గృహాలూ, ఆస్పత్రులలో ప్రసూతి వార్డులూ వున్నాయి.

రాజకీయ చైతన్యంతోకూడినట్టి కొత్త సాంకేతికవిద్య నభ్యసించిన, జ్ఞానవంతులైన లక్షలాది స్త్రీలు సోవియట్ ప్రభుత్వంకింద సామ్యవాద నిర్మాణానికి సాగేపోరాటంలో పరిపూర్ణ విద్యను పొందేరు.

సామ్యవాద వుత్పత్తిలో నూతన కల్పనలు చేసేవారిలో నూలువడికే (స్పిన్నర్) కార్మిక స్త్రీ మేరియా రోజెనెవా, నేత కార్మికురాలు లిడియాకొనొనెంకోలు దేశఖ్యాతి పొందేరు. ముడిపదార్థాలను చాలవరకు మిగులుస్తూ ప్రణాళిక హద్దును దాటి వుత్పత్తి చేయడానికి వాటిని వుపయోగించేరు. వారు పని చేసుకుంటూ టెక్స్టైల్ స్కూలులో చదువుకుంటున్నారుకూడాను.

నేత సాంకేతిక పనిరీతులను అభివృద్ధిచేస్తూ మొట్టమొదటి సారిగా 16 మగ్గాలను నడిపించిన వారిలో మాస్కో నేతకార్మిక స్త్రీ నటలియాడుబిగ్గా వొకతె.

లిడియాకొరాబల్నికోవా ప్రసిద్ధగాంచిన వొక స్టాకనొవైట్ కార్మిక స్త్రీ. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో మాస్కోలోగల "పేరిస్ కమ్యూన్" జోళ్లఫాక్టరీలో పనిచేయడానికి వచ్చినప్పుడు యీమె వయసు చాల తక్కువ. తన నైపుణ్యాన్ని నిత్యమూ పెంపొందించుకుంటూ యీ యువతి పిల్లల జోళ్ల ఫాక్టరీలో వొక కార్మిక దళానికి నాయకత్వం వహిస్తూకూడా చదువుకుంటూంది. మొత్తం మీద ముడిపదార్థాల ఖర్చును తగ్గించే వుద్యమాన్ని యీమె లేవదీసింది. 1950 లో ప్రణాళిక నిర్ణయించిన వార్షిక వుత్పత్తిని ఆమెదళం గడువుకు ముందుగానే పూర్తిచేసి, మిగిల్చిపెట్టిన పదార్థాలతో అదనంగా 13,000 జతల జోళ్లను తయారుచేసింది. ఎస్. కొరాబెల్నికోవా మాస్కో పట్టణ సోవియట్లో సభ్యురాలు. ద్వితీయ సోవియట్ శాంతిమహాసభలో సోవియట్ శాంతి సంఘానికి సభ్యురాలుగా యీమె ఎన్నుకోబడింది.

అధిక పంటలకై కృషిచెయ్యడం లక్షలాది సోవియట్ కర్షక స్త్రీలకు చాల ముఖ్యమైన బాధ్యత అయింది.

ఆజెర్‌బైజాన్ రిపబ్లిక్కు సమిష్టి వ్యవసాయదారులలో బస్తీ బగిరోవా, షామమాగసనోవాలు చాల ప్రసిద్ధి పొందేరు. సోవియట్ దేశంలో శ్రమకు లభించే అత్యున్నత గౌరవ ప్రదమైన 'సామ్యవాద శ్రామికవీర' బిరుదులు రెండు వీరికి లభించాయి.

గత మూడేళ్లలోనూ యీ సమిష్టి వ్యవసాయదారులు అధిక పంటలు పండిస్తున్నారు. బస్తీ బగిరోవా ఒక హెక్టరుకు (2½ ఎకరాలకు) 10 టన్నుల పత్తిని పండించింది; షామమాగసనోవా హెక్టరుకు 762 టన్నులు పండించింది. ఇటువంటి అధికపంట ప్రపంచంలో ఏ దేశంలోనూ కనబడదు.

బస్తీ బగిరోవా అధిక పంటలు పండించడంలోనే కాకుండా ఆమె మంచి బోధకురాలుగాకూడా ఖ్యాతిగడించింది. ఈ ప్రఖ్యాత స్టాకానోవైట్ రైతాంగన అప్పుడే వొక వెయ్యిమందికి పైగా పత్తి వుత్పత్తిదారులను తర్ఫీదు చేసింది. ఆమె శిష్యులలో సుమారు 100 మందికి 'సామ్యవాద శ్రామికవీర' బిరుదం లభించింది. ఈమె సోవియట్ కేంద్రశాసనసభలో సభ్యురాలు.

ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో ప్రధానమైన వుద్యోగాలలో సోవియట్ స్త్రీలు సఫలీకృతులైయారు.

విప్లవానికి పూర్వం రష్యాలో ఇంజనీర్లుగానూ, సాంకేతిక నిపుణులుగానూ 600 మంది స్త్రీలకి మించి వుండేవారుకారు. కాని, యీనాడు 327,000 మందికిపైగా సోవియట్ స్త్రీలు ఇంజనీర్లుగానూ, టెక్నీషియన్లుగానూ పనిచేస్తున్నారు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వేలకొద్దీ స్త్రీలు అధికారయుతమైన పదవులలో వున్నారు. వారు అతికష్టమైన వ్యవసాయపు పనులలో ఆరితేరినవారు. 15000 లకు పైగా స్త్రీలు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు అధ్యక్షులుగా వున్నారు. లక్షలాది స్త్రీలు వ్యవసాయపు పనిలోనూ, తోటలూ, పశుపక్ష్యాదుల కార్మిక దళాలకు నాయకత్వం వహిస్తున్నారు; వారు ట్రాక్టర్లనూ, నూర్పు యంత్రాలనూ నడుపుతారు; అనేకమంది స్త్రీలు ట్రాక్టరు దళాలకు నాయకత్వం వహిస్తున్నారు.

సాంస్కృతిక, శాస్త్రవిజ్ఞాన, సాంకేతిక రంగాలన్నిటిలోనూ సోవియట్ స్త్రీ అతిప్రధానమైన పాత్రను నిర్వహిస్తూంది. సోవియట్ జాతీయ ఆర్థిక రంగానికై కళాశాలలో తర్ఫీదు పొందిన నిపుణులలో నూటికి 49 మంది స్త్రీలు. వీరి సంఖ్య 1,300,000 మందికిపైగా వుంటుంది.

మామూలు పాఠశాలలలోనూ ప్రత్యేక సెకండరీ వున్నత పాఠశాలలోనూగల 3 కోట్ల 70 లక్షల మంది విద్యార్థులలో నూటికి 50 మంది స్త్రీలున్నారు. 400,000 మందికిపైగా స్త్రీలు కాలేజీలో చదువుకుంటున్నారు.

విద్యా, శాస్త్రవిజ్ఞాన పరిశోధనా సంస్థలలో అధ్యాపకులుగానూ, సైంటిస్టులుగానూ సుమారు 50,000 మంది స్త్రీలు పనిచేస్తున్నారు. సుమారు 400 మంది స్త్రీలు స్టాలిన్ బహుమతులను పుచ్చుకున్నారు. చాలమంది సామ్యవాద దేశంలో రాజకీయ వేత్తలుగా ప్రఖ్యాతి గడించేరు; ఇది సోవియట్ దేశంలో స్త్రీలకుగల రాజకీయ సమానత్వానికి స్పష్టమైన నిదర్శనం.

ప్రతిరంగంలోనూ సోవియట్ స్త్రీ కమ్యూనిస్టు సమాజ నిర్మాతగా ప్రసిద్ధిపొందింది. సోవియట్ స్త్రీల శక్తి, గౌరవ, వీరోచితశ్రమ, ప్రతిభా విశేషాలవలన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాలు ఎంతో లాభం పొందేయి. సోవియట్ స్త్రీలు తమ విజయాలన్నిటికీ కారణభూతమైన ప్రభుత్వానికీ, లెనిన్, స్టాలిన్ల పార్టీకీ కృతజ్ఞులై వున్నారు.

"టాస్" నుండి.

# స్వర్గీయ శ్రీ రుక్మిణీ లక్ష్మీపతి

భారతజనని నేడు మరియొక ఉత్తమ పుత్రికారత్నాన్ని కోల్పోయింది. స్వాతంత్ర్య యోధులలో ఒకవీర సాధ్వీమతల్లి అస్తమించింది. సరోజినీదేవివంటి నాయకమణు లస్తమించిన కంటితడి ఆరకముందే సోదరి శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి నిర్యాణవార్త మమ్ములను గాఢవిషాదంలో ముంచినది. దక్షిణావని కే కాదు. భారతభూమి కేయిది తీరనికొరత. ఆమె ధన్యజీవి.

శ్రీ రుక్మిణమ్మగారు గొప్పవిదుషీమణి. భారతస్వాతంత్ర్య సమరములో ఆమెసేవా త్యాగములు ఆదర్శనీయములు. మహిళాభ్యుదయమునకు ఆ యమ్మ చేసిన కృషి అపారము. దేశసేవలో అడుగుపెట్టినది మొదలు తుదిక్షణమువరకు స్వరాజ్య పోరాటములో ఏ యుద్యమమునందును వెనుకాడలేదు. కర్తవ్యమును ఎన్నడును ఏమరలేదు. సర్వవిధాల దేశానికి, సంఘానికి కుటుంబానికి, ఉత్కృష్టసేవచేసి కీర్తిశేషురాలైన ఉత్తమ యిల్లాలు. దేశకళ్యాణానికి, జీవితాలు అంకితంచేసుకొని చరితార్థులైన వారిలో ఆమె యొకరు. స్వాతంత్ర్య వీరనారీమణులైన భారత స్త్రీలలో ఆమె శాశ్వతముగా వెలుగొందగలదు.

మా కామె కేవలము సోదరివంటిది. ఆ ఆత్మీయమైత్రి చిరస్మరణీయంగా నుంటుంది. వారు జైలులో అతిసన్నిహిత మిత్రులలో ఒకరుగా ఉండేవారు. ఈ విషాదవార్త వినగనే అవిఅన్ని కళ్లకు గట్టినట్లయినవి.

శ్రీ రుక్మిణీ లక్ష్మీపతిగారిది మంచి సంస్కార కుటుంబము. వారియిల్లు వచ్చేపోయే వారితో ఎప్పుడూ కలకలలాడుతూ వుండేది. బంధుమిత్రులకు అతిథి అభ్యాగతులకు వారిసత్కార మర్యాదలు ఎంతో ఆదరణీయమైనవి. బీదలపైమిక్కిలి ప్రేమవాత్సల్యాలు చూపేవారు. వారి అండచేరి బ్రతుకుతెరువు పొందినవారూ, వారినాశ్రయించి ఉన్నతి చెందినవారూ ఎందరో యున్నారు. ఆమె నిరాడంబరము శ్లాఘనీయము.

ఆమె ఎన్నోపదవులు నిర్వహించినారు. శాసనసభల ఎన్నికలలో తొలిసారిగా గెలుపొందిన మొదటి స్త్రీ ఆమె. మద్రాసు రాజ్యాంగములో మంత్రిపదవి నిర్వహించిన ఏకైక మహిళామణికూడ ఆమెయే. ఇంకను మద్రాసు, అన్నామలై యూనివర్సిటీల

సెనేటు సభలయందును, అనేక ప్రజాసంస్థలు, ప్రభుత్వకమిటీల యందును సభ్యురాలై విశేషకృషిచేసినది. తన మంత్రిత్వహయాములో పట్టుపట్టి మద్రాసు ఎల్.ఐ.ఎమ్. స్కూలును కాలేజిచేసి మెప్పుగొన్నారు.

ఏసభలకైనా అధ్యక్షురాలుగా రాకతప్పదని ఆహ్వానిస్తే శాంతంగా అంగీకరించి విచ్చేసేవారు. వేదికపై నిలిస్తే ఇక సింహగర్జనమే. వాగ్ధారావాహినికి ప్రేక్షకులు ముగ్ధులు కావలసిందే. అంతచక్కని ఇంగ్లీషు మాట్లాడేవారు పురుషులలో సైతము అరుదు.

జాతీయ అంతర్జాతీయ రంగాల్లో ఆమె అత్యంతమూ పేరుప్రతిష్ఠలు పొందింది. అంతర్జాతీయ మహిళాసభల్లో ఆమె ప్రాతినిధ్యం భారతభూమికి కీర్తితెచ్చింది. ఆమెఎంత విద్యావతియో అంతస్నేహమయి. ఎంతత్యాగశీలయో అంతసేవావ్రత. మహిళాలోకానికి మాననీయమైన చక్కని సంస్కృతిజీవనాన్ని ప్రదర్శించి ఇహలోకయాత్ర చాలించారు. శోకాకులురైన వారిబిడ్డలకు, భర్త శ్రీ లక్ష్మీపతిగారికి మాసానుభూతి తెలుపుతున్నాము.

నిండుజీవితమున షష్ఠిపూర్తిజరిపి ఆ పంచుముత్తైదువు బిడ్డలముందు భర్తముందు ఉల్లాసముగా వెళ్లిపోయినారు. ప్రశాంతముగా కన్నుమూసి భారత స్త్రీ కోరుకునే పరమ పదవి ప్రాప్తించింది ఆపుణ్యవతికి.

అసత్తునుండి సత్తుకు తమస్సునుండి జ్యోతిస్సుకు
మృత్యువునుండి అమృతమునకు నిర్గమించిన ఆ
పవిత్రాత్మకు సర్వదా జోహారులు. ఓంశాంతిః!

కనకమ్మ,
లక్ష్మీబాయమ్మ.

---



---




M.1.

మద్రాస్ హాండ్‌లూం వీవర్స్ ప్రావిన్షియల్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్

ఎగ్మూరు — మద్రాసు.

# తెలిసీ తెలియని వైద్యాలు

ఈకథ నిజంగా జరిగిందే. నాకప్పుడు పదేళ్లుంటాయేమో! నాకు యిప్పటికీ కళ్లకు కట్టినట్లుంటుంది ఆనాటి విషాదసంఘటన. ఇక చెబుతాను వినండి ఆసంఘటన!

మాయింటిప్రక్కన ఒక పూరిగుడిసెలో కాపురస్తులు ఒకరు కాపురముండేవారు. వారికి వొక కొడుకూ, కూతురు. తండ్రికి స్కూల్లో మేష్టరుపని. పాపం వాళ్లకు చాలా రోజులకు యీ పిల్లలిద్దరూ పుట్టారు. పిల్లవాడికి మూడేళ్లు, పిల్లకు అయిదారేళ్లు వుంటాయి. మామూలుగా పిల్లలకు జలుబు చేసి జ్వరమువస్తే వాళ్ల అమ్మమ్మ యేదో మందాకు రసంతీసి పోసేదిట. తగ్గిపోతూ వుండేది. అలాగే వోరోజున పిల్లలకు జలుబు చేసింది. పిల్లలతాత, అమ్మమ్మ, తండ్రి మద్రాసులో యేదో యెగ్జిబిషన్ వచ్చిందంటే చూడటానికని ప్రొద్దున్నే బయలుదేరి వెళ్లారు. ఇంట్లోతల్లి, పిల్లలే వున్నారు. ఆరోజు కొంచెం జలుబు భారం యెక్కువగా నున్నది. కొద్దిగా జలుబు భారమే తప్ప పిల్లలు మామూలుగా ఆడుకుంటూనే యున్నారు.

ఆవేళ ప్రొద్దున యేదో ఆడుకుంటూ మాయింటికి వచ్చారు కూడాను ఆపిల్లలిద్దరూ! జలుబు చేసినప్పుడు యేదో ఆకురసం తీసి పోస్తూవుండేదిగదా అమ్మ (పిల్లల అమ్మమ్మ) అని చెప్పి తల్లి ఎక్కడ నుంచో ఆకుతెచ్చింది. తనతల్లిపోసే ఆకు అదే అనుకొని, (నెరడాకు) ఈ ఆకుకషాయం కాచి దాంట్లో కూటునీళ్లు కలిపి (కూటునీళ్లు అంటే రాత్రి అన్నంలో గంజిపోసి వుంచిననీళ్లు) ఉప్పు, యింకా యేదో కలిపి కాచి పొయ్యటానికని, పిల్లలను యెక్కడో ఆడుకొంటున్నవారిని రమ్మని పిలిచింది. వాళ్లు అమ్మ యేదోమందు పోస్తుందని రామని మారాంచేశారు.

ఆయిద్దరినీ తీసుకువచ్చి మందుకాస్త పోసింది అమాయకురాలు, తల్లి.

ఇకపోయి ఆడుకోండి తగ్గిపోతుందని తాను పనిచేసుకునేందుకు యింట్లోకి వెళ్లింది. ఆ మందు పోసిన రెండునిమిషాలకల్లా పిల్లివాడికి కడుపు వుబ్బుకొచ్చి వొకటే ఆయాసం, గుడ్లు తేలవేశాడు. కూర్చున్నవాడు కాస్త క్రిందకు వొరిగాడు.

'అయ్యో పిల్లవాడు కూర్చుని ఆడుకొంటున్నవాడు కాస్త క్రిందకు పడిపోయినాడేమిటి' అని యింట్లో పనిచేసుకునేది కాస్త పరుగెత్తుకు వచ్చింది. తల్లివచ్చి చూచేటప్పటికి యేముంది అప్పటికప్పుడే పిల్లవాడిప్రాణం పోయింది. ప్రక్కనున్న పిల్లకూడా గ్రుడ్లుతేలవెయ్యటం మొదలుపెట్టింది. యింకేముంది తల్లి 'నేనుపోసింది మందుకాదర్రా యేదోవిషం' అని గోలపెడుతూంది. ఇరుగుపొరుగు వారంతావచ్చి పిల్లను ఆస్పత్రికి తీసుకువెడుతున్నారు. కానీ యేమిలాభం ఆ పిల్లకాస్త దారిలోనే పోయింది. ఇంట్లో యెవ్వరూలేరు. ఆ తల్లి వొకటేగోల, చేతులారా చంపుకున్నానని. కాదుమరి! పాపం విధివశాన యేదో

జబ్బుచేసిపోతేనే ఆజన్మాంతం బాధపడతావే! అందులో తెలియక చేతులారా చేసుకున్నది ఆ తల్లికి యెంత కడుపుకోత!

ఆ పిల్లలను చూచేందుకు వూళ్లోజనం అంతా తిరణాలకు వచ్చినట్లు వచ్చిపోయారు. సాయంకాలానికి యీసంగతి తెలిసి, మద్రాసునుంచి, తాత, అమ్మమ్మ, తండ్రి వచ్చారు. జరిగినదానికి యేడుస్తూ వుంటే పాపం, ఆ తల్లిని! కావాలని చంపావు అని కొందరు, తెలిసీ తెలియకుండా యిలా యెందుకు చేయాలని కొందరు, ఆవిడ మాత్రం యేమిచేయగలదు? దురదృష్టం అలాకలిసి వచ్చిందని కొందరు, యిలా నలుగురూ నాలుగుమాటలు అన్నారు.

ఆవిడ మాత్రం యేమిచేయగలదు పాపం! యేతల్లైనా పిల్లలకు కావాలని మందుపెట్టుతుందా! అందుచేత నేను చెప్పబోయేది యేమిటంటే ఇంట్లో పెద్దవాళ్లను అడగకుండా 'తెలిసీతెలియని వైద్యాలు' చెయ్యకూడదు. యిది నాకు తెలుసులే! వాళ్లను అడిగేదేమిటి అని అనుకోనవచ్చు కొందరు. కానీ, మందుల విషయాల్లో మాత్రం చాలా జాగ్రత్తగా వుండాలిసుమా! లేకపోతే యెలాప్రమాదం సంభవించిందో చూడండి.

వినత



#  సౌందర్యము 

శ్రీమతి వాశిరెడ్డి సుశీలాదేవిగారు

అలంకారమనేది మనసుకు ప్రమోదము కల్గించుతుంది. స్త్రీ తనయందలి అధిక, అమోఘ, సున్నితమైన అలంకారముతో, పురుషుని హృదయమునందలి భావముల రసవత్తరములుగాజేసి, ఉత్తేజుని, కార్యోన్ముఖుని జేస్తుంది. ప్రకృతి తన విమల సౌందర్యముతో, చైతన్య పురుషుని ఎవ్విధంబున ప్రమోదంబు గల్గించి, జీవితరంగమందు, కార్యోన్ముఖుని, కళాపురుషునిగా జేయగల్గుతుందో, ఆ విధముగానే స్త్రీయు, పురుషుని పచ్చివలపు వేడితోగాక, పవిత్ర, నిర్మల ప్రేమతో, క్రియా క్షేత్రమందు ఉత్తేజునిగా జేస్తుంది.

అంతఃభావములే, బాహ్యజీవిత రూపము దాల్చును. మనభావములు పవిత్రములై, ప్రేమభరితమై, కళాకాంతివంతమై, కరుణార్ద్రమైయున్న, మనభావముల ప్రకటించు, మనముఖములు, లలితము, లావణ్యములై నవనవలాడుచు, ప్రేమప్రదీపికలై కళాకాంతులు వెదజల్లుచుండును. భావములెపుడు స్థూలరూపమునుంచి, సూక్ష్మమై - నిర్మల నీరమువలె ఏకముఖముగా, చైతన్య వంతముగా ప్రవహించునో అపుడే, సర్వకోమల శక్తులు ఘనీభవించి, పుష్పమువలె సర్వలలితకళలను వెలార్చును. ముఖ్యముగా సౌందర్యమునకు, అలంకరణకు హృదయమే స్థానము. అది రసమయము. కుసుమ కోమలంభావస్థలము. స్త్రీ తన పవిత్ర ప్రేమతో తన పరిసరముల కళామయముగా, తన హృదాకాశప్రేమ వెలుగుచే, మార్చగలదు.

పైజెప్పిన విషయమునకు ఆత్మశక్తిగావలెను. అది సంపాదించుట సామాన్యులకు కష్టమే. విద్య నేర్చినంతమాత్రమునరాదు. సంస్కారముల సంస్కరించినగాని, సంస్కృతి చక్కబడిన ఆకారములో మధుర లలితమూర్తిత్వము గన్పడుతుంది. అదే సంఘములో లతపై కుసుమమై ప్రేమ మధువును పలుదిక్కుల వెదజల్లుచుండును. పైవిధముగ తమ భావముల పరిశుభ్రము సృజించలేనివారు, స్థూలాకారమున కలంకారణ ముఖ్యమగును. ముఖ్యము సూక్ష్మమైన మనసు-తదుపరి శరీరము. పరిశుభ్రత అలంకరణమునకు ప్రాథమిక సూత్రము. ప్రతిదినము చక్కగా చన్నీటితోగాని, నులివెచ్చని జలముతోగాని స్నానమాచరించవలెను. అధికోష్ణజల స్నానమాచరించిన, రక్తమునందధిక వేడికల్గి ముఖము కళాహీనమగును. అందుచేత రక్తము చక్కగ ప్రవహించునట్లు రక్తప్రసరణతో దేహమాలిన్యము ప్రక్షాళన మొనర్చునట్లు జూడవలయును.

ఈ సబ్బులవాడిన దేహమందలి క్రొవ్వును హరించివేయునను వాడుకగద్దు. పెసరుపిండి, భావంచాలు, సుగంధి, వట్టివేరు, పలస్త మొదలగు దినుసులగల్పి శరీరమును తోముచున్న దేహమలినములుబోయి చక్కని లావణ్యము మృదుత్వమువచ్చును. దేహమర్ధనమునకు విటమిన్సు ముఖ్యము. అట్టి పదార్థములు వెన్న, పాలు, దినుచుండు శరీరమును రోగములనుండి కాపాడుచు, మార్దవమును గల్గించు ఫలరసముల దినుచున్న రక్తమలినములుపోయి ముఖము ఆరోగ్యముతో నిండియుండును. ఆరోగ్యములేకున్న సౌందర్యము లేదు. అందుకు ప్రతిదినము తగినవిధమున దేహపరిశ్రమయు ముఖ్యము. ఆంగ్లనాటకకర్త బెర్నాడుషా వ్రాసినట్లు - అలంకరణ వస్తువుల కెగబడుటకు బదులు ప్రతిపూట చల్లని శుభ్రజలముతో ముఖక్షాళన జేయుచున్న - ముఖము తేజోవంతమగునని, తన అనుభవమూలమున జెప్పినారు.

శరీరమునకు అధికకండవున్న, అసలులేకున్న, Symmetry నశించి నేత్రమునకింపుగా నుండదు. ఎప్పుడును మాంసాహారముల భుజించుచున్న - రక్తము మాలిన్యమై, దోషయుక్తమై, ముఖము మోటుబారిపోవును. గనుక అధికముగా మాంసాహారము తగదు. సౌందర్యముహెచ్చు స్వర్ణసామాగ్రిని ధరించిన రాదని జెప్పవచ్చును. ఏవిషయములోనైన అతి తర్కమువలదు. రెంటి సమన్వయమే rhythm అగును. మెడలో స్వర్ణహారము - చేతికి అంగుళీయము, హస్తమున గాజులు - యింతటితో సౌందర్యాలంకరణముల స్త్రీ దేహమందధిష్ఠానము జేయవచ్చును. అన్నిటికి మించినది ప్రకృతి వరప్రసాదమైన పుష్పములుండనేయున్నవి. అవి అన్ని లోట్లను పూరించి తమ వికాస నయనములతో నలుదిక్కుల కళామయమును జేయును. స్త్రీ శరీర భావమునుంచి, అలౌకిక, కళామయ ప్రపంచమునకు పుష్పములు దిగును. ఆలోకమందే సౌందర్యమునకు అర్థము దొరకును.

కాఫీ, టీ, మొదలైన ఉద్రేకపరుచు పానీయములు రక్తమున వేడిగల్గించి, కణముల ముకుళింపజేసి, సహజసిద్ధ సౌందర్యమును దూరముజేయును.






# ఆనపకాయతో అనేకవిధాలు

## ఆనపకాయ హల్వా.

లేత ఆనపకాయ తొక్కతీసి ఎండుకొబ్బరి కోరాముతో కోరుకుని, 2 కప్పులకోరు 4 కప్పులు చిక్కనిపాలు ఒక ఇత్తడి బూర్లెమూకుట్లో పోసి పాలుఇగిరి ముద్దగా అయేవరకూ కలుపుతూ కాచి $2\frac{1}{2}$ కప్పుల పంచదార ఆ ముద్దలోవేసి, బాగా ముద్దగా అయ్యేవరకు కలిపి, $2\frac{1}{2}$ కప్పునెయ్యి, చిటికెడు మిఠాయిరంగు, ఒక చిన్నచెమ్చా ఏలక్కాయపొడి, 10 తులాలు తొక్కతీసి వేయించిన బాదంముక్కలు ఆ ముద్దలోవేసి నెయ్యి ఇగిరిపోఏవరకు కలిపి దించి చల్లారినతరువాత సీసాలోవేసి వుంచితే హల్వా15 రోజులవరకు నిలువవుంటుంది.

## ఆనపకాయ పరవాన్నము

లేత ఆనపకాయ తొక్కతీసి ఎండుకొబ్బరి కోరాముతో కోరుకుని, ఒక కప్పుకోరుకి 3 కప్పుల పాలు, 1 కప్పు పంచదారచొప్పున కొలుచుకోవాలి. ఆనపకాయ కోరు, పాలు ఒకకళాయి గిన్నెలోవేసి పొయ్యిమీద పెట్టి బాగాకాచి పంచదార, ఏలకపొడి, వేయించిన జీడిపప్పు, ద్రాక్షపళ్లు కుంకుమపువ్వువేసి 10 నిమిషాలు కాచి దించాలి.

## ఆనపకాయ దోసెలు

ఒక ఆనపకాయ తొక్కలు, ముషురుగింజలు తీసుకోవాలి. 1 పావుశేరు కందిపప్పు, 1 పావుశేరు బియ్యం, 3 గంటలు నాననిచ్చి శుభ్రముగా కడిగి, ఆనపకాయతొక్క, గింజలు, పచ్చిమిరపకాయలు, అల్లం, జీలకర్ర, వుప్పు, వేసి రుబ్బి పెనంమీద నూనెరాసి, ఒక్కొక్క గరిటెడు రుబ్బినపిండి పోసి చేతితో నెరిపి, పెసరట్లులాగ కాల్చాలి. ఇవి అన్నంలోతినడానికి చాలా రుచిగా వుంటాయి.

## ఆనపకాయ వూరగాయ

పొయ్యిమీద ఒక కళాయిగిన్నెలో 1 కప్పు నువ్వులనూనెపోసి బాగా కాగినతరువాత $\frac{1}{2}$ టీస్పూన్ ఇంగువ, 1 టీస్పూన్ ఆవాలు, $\frac{1}{4}$ టీస్పూన్ మెంతులు, కొంచెము కర్వేపాకువేసి వేయించి, లేతఆనపకాయి తొక్కతీసి ముక్కలుగా తరిగి 2 కప్పుల ముక్కలువేసి 5 నిమిషాలు వేయించి, చారెడు కారం, 1టీస్పూన్ పసుపు, 1 నిమ్మపండు రసము వేసి బాగా కలిపి దించి చల్లారినతరువాత సీసాలో వేసుకోవాలి.

వాడ్రేవు సీతమ్మ.

# చిత్రాంగి

శ్రీ ఎ. వి. ఇ. యల్. సత్యనారాయణరావు

(గత సంచిక తరువాయి)

చి:- గాబరాకాదే చెలీ! నన్ను నీవు యిలా పరీక్ష చెయ్యడం నీకు ఆనందంగా ఉన్నదా? నేను భరించగలనా? ఇది అకారణమైన ఆందోళన కాదే! అయ్యో! పిచ్చిదానా ఏం చెప్పమంటావు, సంతోషాతిరేకంలో కలిగే ఒక అవ్యక్త మధురానుభూతికి కారణం లేకపోవడమేమిటి చెప్పూ! నిర్మల నీలాకాశం మీద నీలిమబ్బులు గోచరించగానే లోకం పొంగి ఎరుగని ఆనందం పొంది మయూరం పురివిప్పి ఎందుకు నృత్యం చేస్తుంది? నాగస్వరం మీద తియ్యటి రాగాలాపన చెయ్యగానే నాగుపాము పడగవిచ్చి లోకాన్ని మర్చిపోయేటంత మౌనముద్రలో మునిగి ఎందుకు స్వప్న తాండవం గావిస్తుంది చెప్పు? అయ్యో చెలీ! ఈ పావురం తెచ్చిన ఏదో అవ్యక్త సందేశానికే మురిసిపోయి, లోకంలో ఏదివ్యానుభూతికీ ఏజీవి కూడా చెందని పరవశత్వంలో మునిగి పోయేను. చెలీ! చెప్పవే యువరాజును ... కాదు - నా ప్రియుని ఆహ్వానించడానికి ......

చె:- అయ్యో! ఎంతమాటన్నావు తల్లీ! నీకేమమ్మా అందాల రాణివి. అలంకారాలు నీకసలే అనవసరం! ఇదుగో ఈ నిలువుటద్దంలో చూచుకో అమ్మో! వెర్రితల్లీ! నిన్ను నేనెప్పుడైనా ఒక్క పరిహాసవాక్యం అయినా అన్నానా? అడవిని కాచిన వెన్నెలవలె అపురూప సౌందర్యం దిక్కుమాలి ఈసౌధంలో విలపిస్తూంటే చూసి చూసి, కళ్లు కాయలుకాసి, కడుపు చెరువుకాగా, నీతోకూడా నేనూ నీసేవలో ఏకాంత సేవ చేసేనమ్మా భూపరిభ్రమణులాగున. అమ్మా! పావురాన్ని యిలాయిచ్చి వేగం లేవమ్మా - అదుగో యువరాజు వచ్చేస్తున్నారు!

చి:- చెలీ యిదుగో పావురం.

చె:- అయ్యో! విడువకుసుమా అని యిప్పుడే అని పావురాన్ని నేల విడిచేవా? ... ఓహో! ఆవంక చూస్తూ అవ్యక్తంగా విడిచేవా! అమ్మా నేను వెళుతున్నాను.

[రంగము:- సారంగధరుడు ప్రవేశిస్తాడు]

సా:- నమస్కారం తల్లీ!

చి:- వచ్చేవా సారంగా! (నవ్వుతూ) తలవని తలంపుగా ఎందుకు కలిగిందో నాపై ఈ దయ!

సా:- అయ్యో! ఎంతమాటన్నావు తల్లీ! నీ దర్శనం చెయ్యవలసిన విధికి దయతో

ప్రసక్తి ఎందుకు ? నేను వచ్చిన కార్యం మనవి చేస్తాను. చిత్తగించు తల్లీ! వినోదార్థం పావురాలను ఎగుర వేస్తూన్న సందర్భంలో నా పావురం మీ సౌధం దిక్కుగా వచ్చి, లోపల ప్రవేశించింది. దయచేసి పావురాన్ని యిచ్చి నన్ను పంపమని ప్రార్థన.

చి:-ఓహో! మహారాజుల సన్నిధిని మనవి చేసినట్టుగా చెబుతున్నావే సారంగా!

సా:-నీవు మహారాణివి కావా! పైగా నా తల్లివి,-కాబట్టి మనవి, మన్నన ఆవశ్యం. ఇందులో అసత్యం ఏమున్నది తల్లీ! నా పావురాన్ని నాకియ్యి తిరిగి పోవాలి వేగం!

చి:-మంచి యుక్తిగా చెప్పేవు సారంగా! నీ పావురాన్ని నీవు తప్పకుండా తీసుకో వచ్చును. కాని యింత తొందర ఎందుకు? ఈ దినం ఆగిపోరాదా ?

సా-:వద్దుతల్లీ! దయ ఉంచి పావురాన్ని యిప్పించు – వేగం తిరిగిపోవాలి!

చి:-ఎక్కడకు పోతావు సారంగా! ఇక్కడ నీకు కలిగిన అభ్యంతర మేమిటి? ఇదీ నీసౌధ మేకదా! ఇంత కాలమైంది ఎన్నడూ నీ విక్కడకు రాలేదే! ఏదో దైవకృపవల్ల నీ విక్కడకు వచ్చుట తటస్థించింది. ఈ దినం ఆగిపోదువుగాని, సారంగా నామాట మన్నించవూ ?

సా:-లేదుతల్లీ నన్ను క్షమించు. నీ ఆజ్ఞకు అడ్డు చెప్పేనని నన్ను కోపగించకు. నేను త్వరగా పోవాలి తల్లీ! నా పావురాన్ని నాకిచ్చి పంపించు, నిన్ను వేడుకుంటు న్నాను.

చి:-సారంగా! ఒక్కదినమేకదా నిన్ను ఉండమని కోరినది.

సా:-క్షమించి నన్ను పంపుతల్లీ!

చి:-ఓహో! అలాగునా! ఏమయ్యా అంత నిర్దయా? నాకోర్కె మన్నించుటే నీకు కష్టంగా తోచిందా? పోనీలే, (నవ్వుతూ) సారంగా! నీ యిచ్ఛవచ్చినట్టే చెయ్యి. కాని నాది ఒక్క కోర్కె–ఒక్క క్షణ కాలం యిచ్చట ఆగి, నేను సమర్పించు కొనే పదార్థాలను గ్రహించి, నన్ను... సంతృప్తురాలను చెయ్యమని నాప్రార్థన.

సా: ఎంతమాటన్నావు తల్లీ! అంత కన్నానా, యియ్యితల్లీ! ఏమిదయ చేస్తావో-కడుపునిండా భుజించి నీకోర్కె నెఱవేర్చి పోతాను.

చి:-నేను కోరేదికూడా అదే సారంగా! అటుచూడు ఒక్కసారి - ఆ చిత్రపటం! నీదేకదూ? అది మానవనిర్మితం! అంచేతే నిజస్వరూపంయొక్క మోహనత్వం పూర్తిగా ప్రతిబింబించలేదు. కాని ఆ చిత్రపటంలోని మూర్తినే, చిత్రపటం లోనే కొంతకాలం క్రిందట దర్శించి నప్పుడు కలిగిన ఒక తియ్యటి కలలో, ఒక ఆనందాను భూతిలో మేరువిహారం చేసేను. కాని కలకరిగి, నిరాశాంధ కారంలో కూలిపోయేను. (నిట్టూర్పు)

మళ్లీ ఈనాటికి నిన్ను ప్రత్యక్షంగా చూసినప్పుడు, యింత కాలంనుంచి ఈ చీకటికోణంలో దారి తెలియక తల్లడిల్లిపోయిన నా హృదయం ఒక వెలుగు రేఖనుచూసి వికసించింది. ఒక నూతన చైతన్యాన్ని పొందింది. నేను నీకిచ్చే దేమున్నది సారంగా! ... నా హృదయాన్నే నీకు అర్పించేను. ప్రణయ మధువుతో నింపిన నాహృదయ పాత్రను నీకు సమర్పించు కుంటున్నాను. అనుగ్రహించు సారంగా!

సా:-తల్లీ! క్షణకాలంనుంచి చూస్తున్నాను. నీవేవో విపరీతమైన వాక్యాలు పలుకుతున్నావు. నీ అభిప్రాయం అగమ్యగోచరంగా నున్నది. ఇది నీకు ధర్మంకాదు తల్లీ! దయచేసి నాపావురాన్ని అనుగ్రహిస్తే పోతాను.

చి:-యింకా పావురం, పావురం అనే పలవరిస్తున్నావా సారంగా! నీపావురం నీముద్దుల పావురం-నీసమక్షాన-నీ అనుగ్రహం కోసం తల్లడిల్లి పోతుంటే ఏమలా నివ్వెరపోయి చూస్తావు?

సా:-తల్లీ! నీసంభాషణ కర్ణ కఠోరంగా నున్నది. ఇదినీకు న్యాయంకాదు సుమా!

చి:-సారంగా! నాసంభాషణ కర్ణకఠోరంగా నున్నదా! న్యాయ విహీనంకదూ నేను పలికినది! ఔను! లోకంలో నన్ను బోలిన భగ్న హృదయులు పలికే దీనాలాపాలు నీవంటి వారికి అలాగే ఉంటాయి! అది, లోకసహజం. కాని నేను గురి అయిన అవస్థ నీవు గుర్తించలేవా? నీ అనుగ్రహానికి పాత్రురాలను కానా సారంగా? నీకోసం తపించిపోతున్న నా ఆశాపిపాస అవకాశంలేని అభ్యంతరంలో మృగ్యం అయిపోయింది - నా హృదయాన్ని నీకేనాడో అంకితం గావించేను. ప్రణయభిక్షపెట్టుమని ప్రార్థిస్తున్నాను సారంగా! నీతండ్రిగారు నాకు గావించిన అన్యాయం తెలియదా నీకు? కాని నా హృదయం అంగీకరించినది నీ హృదయాన్ని - నేను అభిలషించి, అపేక్షించినది నిన్ను సారంగా! చిత్రపట ప్రదర్శనంలో నీ అపూర్వ సౌందర్య మూర్తినిచూసి ఎంతో ఆనంద పరవశురాలనై నాభావిజీవితం నిరంతర సౌఖ్య పథాలలో తీర్చి దిద్దుకొని, ఆశాసౌధం నిర్మించుకున్నాను. లోకంలో యవ్వన స్త్రీ హృదయం అభిలషించే దంతకన్న ఏమున్నది? కాని వివాహం ముగిసిన నాటినుంచి నా ఆశాసౌధం కూలిపోగా దిక్కుమాలి, వెలుగు వెలుగని ఈఅంధకారంలో కుమిలి, కుమిలి, కృశించి హృదయం బడబాగ్నులలో దిగడం అయిపోతుంటే ఎవరికి నివేదించుకోడం నానిరవరోధ విషాదజీవితగాథ! నా సౌందర్యం అడవిని కాసిన వెన్నెలై, నా ఆశలు బొంగరం త్రాడువలె పుసికిపోయి, పావలపులు చిందరవందర కాగా, రాత్రులు శివరాత్రులుగాగడిపి, నీకోసం

పరితపించి, వేడినిట్టూర్పు సందేశాలు నీ అనుగ్రహంకోసం పంపుకున్నాను. చిట్ట చివరకు ఏదో అనిర్వచనీయమైన ఒకశక్తి మనల్ని యిచ్చట సమావేశపరిచింది ఇంకనిన్ను విడువలేను సారంగా!

సా:- తల్లీ! నీ వెవరితో మాటాడుతున్నావో తెలిసేయున్నావా? నేనీ కుమారునితో మాట్లాడవలసిన విధానం యిదా? నీకు తగదుతల్లీ ఈ ప్రవర్తన. నీ హృదయాన్ని మలిన పరచుకొని జీవితం భగ్నం చేసు కోడానికి నిశ్చయించుకున్నావు. పైగా నన్ను అన్యాయంగా నిందలపాలు గావించడానికి యత్నించకు. నీకెందుకు కలిగింది తల్లీ ఈదురభిప్రాయం?

చి:- ఓహో, అలాగునా? ఇంక నాజీవితాన్ని పాడుచేసుకొనే దేమున్నది? ఏ పరమ సౌఖ్యాలలో తులతూగు తున్నానని జీవితం పాడుచేసుకోడానికి భయపడ మంటావు? పిచ్చివాడా! సూత్రం తెగిన గాలిపటానికి, చుక్కాణి విరిగిన నావకు శరణ్యం ఊహిస్తున్నావా? సారంగా! కేవలం అమాయకుడివలె మాట్లాడు తున్నావే! చిత్రపటాలతో మభ్యపరచి, లోకానికి కన్నుగప్పి గావించిన ఈ ప్రతి కూల దాంపత్యాన్ని హృదయం గల ఏమానవజీవి హర్షించగలడు? పంచ భూతాలు సాక్షిగా వివాహం జరిగినది మనకే. నేనునిన్నే ప్రేమించేను. నీకో సమే యింత కాలంనుంచి సుఖ దుఃఖా లలో తపస్సుచేసేను. నాజీవిత సర్వస్వం మీద హక్కునీది! నేను నీదానను సారంగా! స్వప్నంలో, చైతన్యంలో నిన్నే ప్రేమించి, ఆరాధించి, తపించిపోయాను. నీతో కూడి జగమెరుగని ఆనందంలో మైమరచి పోదామని ఎంతో ఆశపెట్టు కొన్నాను సారంగా! నీపాదాలుపట్టి ప్రార్థిస్తున్నాను ప్రేమభిక్ష పెట్టవూ?

సా:- నన్ను తాకకు తల్లీ! భయంకరమైన దుర్గతి నీకూ నాకూ కూడా సంభవింప జేసే సాహస కృత్యానికి పూనుకుంటు న్నావా? నీవు స్త్రీవి కావూ! స్త్రీసహజ మైన సిగ్గు, బిడియం విడచిపెట్టి నా మీద దాడి చేస్తున్నావా? ఇది నీకు తగనిపని - దూరంగాపో.

చి:- ఓహో! తల్లి!! నే నెక్కడి తల్లిని నీకు? స్త్రీ సహజమైన సిగ్గు! బిడియం!! ఎక్కడి నీతులు నేర్చుకున్నావు? స్త్రీ సహజమైన సిగ్గు, బిడియం ఏమో తెలు సుకున్న నీవు పురుష సహజమైన లక్ష ణాలను మంటగలిపేవా? నీవు పురుషుడివి కావా? మానవత్వం లేదా నీకు? ఔను. తరుణి తనంత తావలచి వస్తే చులకన!! అయ్యో! సారంగా! సారంగా! ఎక్క డకు పోతున్నావు? నిలువు! నిలువవా? వెళ్లిపోయేవా! సారంగా! సారంగా పురు షత్వాన్ని విసర్జించిన ధీరుడా! నా ఆశా లతను మొదలంటా నరికేవా? అనుభ విద్దువుగాని లే దీనికి ప్రతిఫలం!!

——)o)——

# రాసలీల

శ్రీమతి ఎం. ఎస్. సీతాదేవి.

కమలాప్త చంద్రనేత్రుని, కమలోద్భవు గన్న మేటి, గమలానాథుఁ,
కమలసునాభుని గన్గొన గమలాననలెల్ల చనిరి కౌతుకమొసగన్.

సుదతులెల్లడ గృష్ణుని వెదకి వెదకి ఎందుగానక నిస్పృహఁ జెంది యలసి,
సొమ్మసిలు వేళ హరిపౌసమూపుటయును వినుతి సేయగ దొడగిరి వివిధగతుల.

నీదుముద్దుపల్కు నీమోముచందంబు, నీదునవ్వు, కృష్ణ! నీదుహాయులు
నీదురూపుసొంబగు, నీదయాసారంబు మమ్ము నిచటికీడ్చె మరులుకొలిపె.

కురులు లలాటపట్టి నతికోమల వాతముచే జలింప, క
స్తురితిలకంబు చెమ్మటల దోని స్రవింపగ మోవి నానుకెం
గరముల వేణువొత్తికల కంఠనినాదము గ్రుమ్మరించునో
హరియిటు మామనంబుల రయంబున దోచుకొనంగ బాడిమే.

పదనఖదీప్తి జాలములు పాముల తేని ఫణాళిఁ గ్రమ్మచున్
తదుపరి రత్నసంఘముల సవ్వగ నొదలనాడి శౌర్యసం
పద, యమునాంబువున్ విషముమార్చి సుధామయమై యొసర్చితో
యదుకులదీప నిన్నుగొనియాడగ శక్యమె ఎంతవారికిన్.

మాధవా యన జిహ్వకు మధురమబ్బె గృష్ణయనినంత కంఠంబు తృష్ణమానె
రామనామంబు హృదయాభిరామమయ్యె హరియనగనది పాతకహారియయ్యె.

ననుచు వెన్నుని చరణకంజములనుండి చిందు మకరందముల గ్రోలి చేడెలప్పు
డమృతభక్షకులైనట్టి యమరకాంత లట్లయని మేషత వహించిరపుడుహరియు;

ఒకయెలనాగపైనొఱగి ముచ్చటలాడు నొకచాన కేల్దమ్మి యూతచేయు
పూలదురుమునొక్క పూబోడితుఱుమున మృదుసూక్తులనొకర్తు యేలమాడు
నక్కు నగదియించు నలికులాలకనొర్తు ముద్దాడు నొకకాంత; మురిసి యొక్క
క్రీడావతిని రాసక్రీడకు బురికొల్పు చూడ్కుల సొక్కించు సుదతినొర్తు

రిత్తయలుక దొఱంగ బ్రార్థించునొకతె; నందతికి నన్నిరూపుడై అన్నియును వి
భాసిలె; వ్రజాంగనలగూడి రాసలీల నందసూనుండు బృందావనంబునందు.

———(o)———

# ఆదర్శ మిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణరావుగారు

(గత సంచిక తరువాయి)

‘నువ్వు నాకు తండ్రివిగావు; నీకు నేను కొడుకును కాన’ని వారిద్దరకు మధ్యనున్న సంబంధమును త్రెంచేశాడు, ముక్కోపి. సరస్వతి అంటే పడిచచ్చిపోతాడు. ఆమె వొంటిమీద యీగ వాలితే సహించలేడు. ఆమె రవ్వంత బాధ పడిందంటే - చూడలేడు! సరస్వతిని వాళ్లపిన్ని నానా బాధలూ పెడుతూందని యెవ్వరిద్వారానైనా విన్నట్లయితే, దానిని బ్రతకనియ్యడు. చేతికొచ్చిన దెబ్బ - కాలు కొచ్చినతాపు కొడతాడు తంతాడు. అందుకు వాళ్లయింటిలోనున్న వారందరికీ హడల్! రాజేశ్వరరావు తండ్రిని తొందర చేయడంచేత (కలకత్తానుంచి) సరస్వతికింత త్వరలో పెండ్లి అయిందిగాని, లేకపోతే ఆతండ్రీ యిప్పటినుంచి చెయ్యడు ఆగయ్యాలగంపకూడా చేయనీయదు .. ”

“సరస్వతి పెండ్లికి ఆతనొచ్చేరా?” అని ప్రశ్నించాను.

“లేదు అప్పుడు షూటింగు సమయం వచ్చేందుకు వీలులేకపోయింది!”

“అయితే సరస్వతి మొగుడు చనిపోయాడన్న విషయం అతనికి తెలుసునో తెలియదో?” అన్నాను.

“ఏమో? వాడు చనిపోయినట్లు వాడికి తెలిపుతారు వెంటనే, తెలుపకపోతే యేం జరుగాలో అది జరుగదూ?” అంది నవ్వి. నేను ఫక్కున నవ్వాను!

“అయితే యీపిల్లను తండ్రీ, పినతల్లి మొదలైనవారు కొడుతున్నట్లు, తిడుతునట్లు, దుర్భర కష్ట పరంపరలకు గురిజేస్తున్నట్లు అతనికి తెలియదూ?”

“తెలియదనుకుంటాను. తెలిస్తే దీన్నాయింట్లో నుంచక, తన దగ్గర నుంచుకుంటాడు!”

“అయితే యీపిల్లతనితో ఎందుకు చెప్పగూడదూ?”

“అదే నేనూ అంటున్నది, యీపిల్ల జేస్తున్న పొరబాటంతా యిక్కడే. తన కష్ట సుఖాలను తన అన్నయ్యతో జెప్పగుంటే, యీ బాధలు తను పడాల్సిన అవుసరం లేకపోవునుగదా, కానీ జెప్పదు. తండ్రి తననెంత దుర్భర కష్టపరంపరలకు గురిజేసినా, తండ్రిమీదున్న మమకారం కొద్ది - తనమారటి తల్లి తననెంత కొట్టినా తిట్టినా భూదేవిమల్లే ఓర్చుగుంటూ, ఆమెయెడల తనకున్న మాతృభక్తిని ప్రకటిస్తూ, యేవిషయాన్ని అన్నయ్యకు తెలియజెయ్యనీయదు. తెలియజేస్తే తనకారణంగా, వాళ్లు బాధపడతారని ఆమె యభిప్రాయం!”

“పిచ్చిపిల్ల - ఆమెయింత అమాయకంగా నుండబట్టే వాళ్ళీ పిల్లను క్రిందుకు త్రొక్కేస్తూ, వాళ్ళు ఆడింది ఆట, పాడిందిపాట జరుగుతూంది!” అన్నాను.

“సూరిపిల్లా - నీవంటే తండ్రికిగాని, యింట్లోవున్న తదితరులకుగాని కిట్టదు; నీబ్రతుకు వారి స్వేచ్ఛా ప్రవృత్తి కడ్డుగానుందన్న భావంతో, నిన్నెట్లాగైనా మెల్లిగా కడతేర్చాలన్న యుద్దేశంతో నిన్ననేక కష్ట పరంపరలకు గురిజేస్తున్నారు. నువ్వంటే అభిమానం, ఆశలేని తండ్రియెడల నువ్వెందుకు దయగా ప్రవర్తిస్తావ్? మీ అన్నయ్యద్వారా నీ కష్టాలను సరిదిద్దుకో?”

“వొద్దు కాంతం. ఎన్నికష్టాలకు గురిజేసినా అతను నాకు తండ్రే. అతనికి వ్యతిరేకముగా సంచరించామా ఇహ పరాలలో ముక్తియుండదు; మన కారణంగా వొకరు బాధ పడకూడదు.”

"ఆ పాతబూజు యభిప్రాయములతోనే నీ జీవితం మరింత యడుగంటిపోతూంది!" అని ఒకనాడీ ప్రస్తావన మన యింటికి వచ్చినప్పుడు యెత్తితే, వైవిధంగా జెప్పింది. ఇంక పిల్లనేమనుకోవాలి చెప్పండి" అంది మాయావిడ.

"అమాయకురాలు!" అన్నాను.

కొంతకాలం మేం యిరువురం మౌనం వహించాము.

"అసలు నీతో చెబుదామనుకున్న విషయమే మరిచిపోయాను." అన్నాను.

"ఏమిటది?" ఆత్రంగా ప్రశ్నించింది.

"మనం యెన్నియనుకున్నా కర్మకు వ్యతిరేకముగా, కవచం యీ విస్కృత సృష్టిలో లేదుగదా, కాంతం ఒక్కొక్కరి జీవితాన్ని చూస్తూంటే గుండె చెరువైపోతూ యుంటుంది. ఏ అజ్ఞాతశక్తి వారినలా యేడిపిస్తుందో మనకు తెలియదుగదా - యింతకీ "హిందూటీకీతన్ చేరపలేదు నలువగూడ! అన్నాను." చెప్పవల్సిన విషయం మరుపు మడతలలో వుండిపోవటంచేత!

"అంతే - అంతే, ఎవరెంత పెట్టిపుట్టేరో అంతవరకే యనుభవిస్తారు! ఏదో చెప్పబోయి, ఇందులోకి దిగేరేమిటి?" అంది.

"ఆ - యిప్పుడు జ్ఞాపకం వచ్చింది: సరస్వతికి, మరి నెలదినములు పోయినతర్వాత, పినతల్లి ప్రోద్బలంవల్ల కేశములను ఖండిస్తాడుట తండ్రి!" అన్నాను.

"ఏమిటీ? కేశఖండన!" అంది మా యావిడ తెల్లబోయి.

"అవును, యీమె యంటే పినతల్లికి, పినతల్లి నాయనమ్మ, తల్లికి గిట్టకపోవటంచేత, మొగుడు చచ్చిన ముండకు ఏవయస్సులోయున్నా జుత్తుదీయించటం మన ఆచారమని, అవిధంగా చేయమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయని, ఆమెకు జుత్తుదీయించక బోతే, మన శిరస్సుమీద నలుగురూ వెంట్రుకలుంచరనీ, మన గౌరవం కోసం కాకపోయినా, మనపూర్వులు పెట్టిన ఆచారం యొక్క గౌరవం నిలబెట్టేందుకు, ముఖ్యంగా సంఘం గురించి, యీఘనకార్యం చేయక తప్పదని, లేకపోతే మేము నూతిలోపడి ప్రాణత్యాగము జేస్తామని, సరు తండ్రితో చెప్పటంచేత, అతనీ మహాకార్యము జేసేందుకు నిశ్చయించి, ముహూర్తం పెట్టించాడుట. ఈ మహాకార్యం (లేక) ఘనకార్యం రాజేశ్వరరావుకి తెలియకుండా జరుగాలని, లేకపోతే ఆగిపోతుందని, యెంతత్వరలో యీపని ముగిస్తే అంతమంచిదని గూడ ఆ బోడి ముండలు వీడికి సలహా గూడా జెప్పారు!" అన్నాను.

"ఇదోహటా పాపం, గోరుచుట్టుమీద రోకలిపోటులాగ, కష్టం మీద, కష్టం ఆమెకు సంభవిస్తున్నాయి! పాపం చిన్నపిల్లకు జుత్తుతీయించడం ఏమిటండీ?" అంది.

"ఆ మాత్రం జ్ఞానం వాళ్లకంటే యింక కావల్సిందేముంది? యిందాక నీతో చెప్పానుకదూ. ఆచారం యొక్క గౌరవం నిలిపేందుకు, ముఖ్యంగా సంఘం మంచిని సంపాదించేందుకూ యీ ఘనకార్యం చేస్తున్నారని ... 'శాస్త్రం ఆచార' మనే రెండు పెనురోగాల కెందరి స్త్రీ జీవితాలు ఆహుతి ఔతున్నాయోగదా? ... గతంలో మానవులచే సృష్టించబడిన శాస్త్రాలను వారి గౌరవార్థం మనం పూజించవచ్చును! కానీ వాటినుంచి మనం నేర్చుకోవల్సిన విషయాలేమీ లేవని నాగాఢతర నమ్మిక! మానవులు సృష్టించిన శాస్త్రములలో, ఆచారములలో, మతములలో నున్నంత నీచము, ఘోరము, భగవంతునిచే సృష్టింపబడిన శాస్త్రాచార మతములలో అటువంటివేవీ లేవు!" అన్నా ఆవేశంగా.

(సశేషము)




బాలబాలికలు నారదుని పేరు వినియుంటారు. మహర్షి; గానకళాసంపన్నుడు; ఆయన వీణ పేరు మహతి. అది మీట నవసరం లేకుండానే గాలికి పాడేపాట కనుగుణ్యంగా ధ్వనిస్తుంది.

ఈ మహర్షి బ్రహ్మచారి. అంటే పెండ్లి, సంసారమనేవి లేవు. మూడులోకాలు సంచారము చేస్తూ అక్కడి సంగతు లిక్కడ, యిక్కడి సంగతులక్కడ చెప్పి కలహాలకు కారణంగా నుంటుంటాడు.

అవి విపత్కరమైన కరువురోజులు. ప్రజలు తినడానికి తిండి, త్రాగడానికి నీరు లేక అలమటిస్తున్నారు. ఇంచుమించుగా సకలజీవరాసులు యీవిధంగానే కష్టపడుతున్నవి.

ఆ పరిస్థితులలో ఒకనాడు ఒక కుక్కను వెంటబెట్టుకొని నారదుడు అరణ్యానికి బయలుదేరాడట. దారిలో ఆయనను కొందరుచూచి "మహర్షీ! కుక్కను వెంటబెట్టుకొని బయలుదేరారు ఎక్కడికి" అని అడిగారు.

"ఏమిచేయమంటారు; తిండిలేక కడుపుదహించక పోతున్నది. ఈ కుక్కనైనా చంపి ఆకలి బాధ తీర్చుకొందామని అడవికి తీసుకొనిపోతున్నాను." అన్నాడు నారదుడు.

"మీరు యింతగొప్ప మహర్షులైయుండి ఆకలిబాధ భరించలేక కుక్కనుచంపి తినడమేమిటి? కుక్కనుచంపడం పాపంకదా' అన్నారామనుష్యులు

"భలే బాగా అన్నారు. నా ఆకలిబాధ మీ కేమి తెలుస్తుంది? ఈబాధ నివారణయి ప్రాణం నిలిస్తేకదా నేను మహర్షిగానైనా ఎన్నికలోకివచ్చేది. ఈ ప్రాణంపోయిన తరువాత నేను మహర్షినైనా ఒకటే. మట్టినైనా ఒకటే. పాపపుణ్యాలసంగతి భగవంతునికెరుక" అన్నాడు నారదుడు.

"నిజమేమహర్షీ! ఆకలిబాధ బహుదొడ్డది. ప్రపంచములో అన్ని జీవితావసరాలకంటె ఆహారం ప్రధానమయింది. అది సూన్యమయిననాడు ప్రపంచమంతా సూన్యమే" నంటూ వారు వెళ్లిపోయారు. నారదుడు కుక్కను వెంటబెట్టుకొని తన దారిన తాను వెళ్లిపోయాడు.

"శిశి"

—(o)—




# వాయింట చెట్టు

వాయింటచెట్లు సహజంగా మనదొడ్లలో విస్తారముగా పెరుగుచుండును. ఈచెట్టు ఆకులు, వేరు, విత్తనములు వైద్యమున కనేకవిధముల నుపయోగపడుచున్నవి.

ఆకు, వేరురసము హృద్రోగపీడితులకు మేలుచేయును.

వాయింటాకును నలగగొట్టి రోగపీడితమైన చర్మముమీద కట్టినచో అచ్చటి చెడునీరును లాగివేయును.

పిడికెడు ఆకు నలిపి బిళ్లగాచేసి మాడుపట్టునవేసి కట్టుకట్టిన కొంచముసేపటికి అధికముగు వేడిపుట్టును. అప్పుడు కట్టువిప్పి ఆకుబిళ్లనుతీసి గట్టిగాపిండినచో తలనుండి పీల్చిన నీరు వెలుపడును మరల ఆబిళ్లను తలకు కట్టవలెను.

ఇట్లు రెండుమూడుసార్లు చేసినచో తలపోటు, తలనొప్పి, శిరోవాతములు హరించును.

చెవునొప్పి పోటులతో బాధపడువారు ఈయాకు ఉప్పు కలిపి నూరి రసమునుపిండి చెవులో వేసుకొనిన బాధ నివారణయగును.

వాయింట విత్తనములను నీళ్లతోనూరి లోపలికి సేవించినచో జ్వరము, పైత్య రోగములు నివృత్తియగును.

ఈచెట్టు సమూల రసమును నూనెలోకలిపి తైలపక్వముగా కాచి పూసిన కుష్టువంటి చర్మవ్యాధులు కూడ నిర్మూలించును. వాయింటాకు నూరికట్టిన వ్రణములు మానును.

ఆకుగాని, గింజల కషాయము ఈడ్పురోగములను, దోషజ్వరమును నివారించును.

పూటకు 2 తులములఎత్తు రసము, 8 మొదలు 8 తులముల ఎత్తువరకు కషాయము దినమునకు రెండుసార్లు సేవించనగును.

ఈయాకను కూరగాకూడ వండి తినవచ్చును. రుచికరముగా నుండును. కాని కాక, పైత్యముచేయునట్టి గుణములు కలదగుటచే పరిమితముగా ఔషధముగా వాడిననే పైచెప్పిన సుగుణముల జేసును.




శ్రీమతి కె చంద్రమతి

ప్రస్తుత విదుషీమణులలో పేరెన్నికగన్న నారీమణి శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు. ఈమె కవిపుంగవులగు శ్రీయుత వింజమూరి లక్ష్మీనరసింహారావు గారి ధర్మపత్ని. విద్యావిజ్ఞానము లలవరచుకున్న నారీమణి. ప్రాచీన నారీమణులలో నున్న సుగుణములన్నియు నీమెలోనున్నవని చెప్పవచ్చును. అనేక పోటీపరీక్షలలో మొదటి తరగతిలో విజయమొంది బహూకరింప బడినారు. అనసూయా పత్రిక స్థాపించి పత్రికాధిపురాలుగా చాలకాలము పనిచేసిరి. అనేకసభల కగ్రాసనాధిపత్యము వహించిరి. భర్తగారి ప్రోత్సాహముచేత అనేకములగు వ్యాసములను రచించియుండిరి. గృహలక్ష్మి పత్రికా పాఠకులకీమె చిరపరిచితురాలు. గొప్పబిరుదులు వహించిన ప్రజ్ఞా వంతులకన్న అధికముగు విద్యనార్జించియు నివురుకప్పిన నిప్పువలె, సానబట్టని జాతిరత్నము వలె మహిళలలో పేరు ప్రఖ్యాతులు గడించిరి. ఈమె నాకా బాల్యస్నేహితురాలు. ఆకుటుంబముయొక్క ఉన్నతి కామె యదృష్టమే కారణము, ఇరువురు కుమార్తెలును కుమారుడును భర్తయు శోకమగ్నులై పరితపించుచుండగా యీమె ఆగస్టు నెల 24 వ తేదీని కృష్ణజయంతీ శ్రావణశుక్రవారము సాయంకాలము జ్వరబాధచే 7 గంటలకు అస్తమించిరని తెలుపుటకెంతో చింతించుచున్నాను. అరువదిరెండేడులు సిరిసంపదల తులదూగి పసుపు కుంకుమల కూడ స్వర్గమునకు గొంపోయిన పుణ్యముత్తైదువ. శాంతము చిలుకగవుగల ముఖవర్చస్సుతో ఆగర్భ శ్రీమంతురాలుగా సమస్తైశ్వర్య ములతో తులదూగిన సంతోషజీవితము ముగించిన పుణ్యవతి. రత్ననామము సార్థకము చేసి భారతదేశమును రత్నగర్భగా చేసినది. ఈపతివ్రతా తిలకము నవకవులలో నగ్ర స్థానమాక్రమించిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి అనుంగు సోదరి. వీరికుటుంబము పండితకుటుంబములో నెన్నదగినది. పుట్టింటికి అత్తింటికి కీర్తి గౌరవములు సంపాదించిన ధన్యజీవి. ఇట్టి అర్ధాంగిని గోల్పోయి దుఃఖించుచున్న శ్రీ నరసింహారావుగారికిని, బిడ్డలకును నాసానుభూతిని తెల్పుచున్నాను. ఈమె పవిత్రజీవితము స్మరణీయమేగాక ఆంధ్రస్త్రీల కాదర్శకమగునుగాక. పరమేశ్వరుడీమె ఆత్మకు శాంతినిచ్చుగాక.

## సినిమా రంగము



### దీక్ష

"దీక్ష" తెలుగు చిత్రం పత్రికా ప్రతినిధులకు ది 7-9.51 నాడు ప్రదర్శింపబడింది.

ఇది అన్ని విధముల ఉత్తమ చిత్రంగా తయారయింది. ఈచిత్రములోని కథావస్తువు, అత్తగారు చనిపోతూ పసివాడైన తనకుమారుని కోడలికి ఒప్పజెప్పిపోతే అష్టకష్టాలుపడి తాను మాటయిచ్చిన ప్రకారం తనమరది తుంటరివాడైనా పెంచిపెద్దవాణ్ణిచేసి ఉత్తము పౌరునిగా సమర్పించిన త్యాగమూర్తికథ

కథచాల రసవత్తరంగా నున్నది. సన్నివేశాలు, సంభాషణలు సహజంగాను, సమయస్ఫూర్తిగా నున్నవి.

సంగీతము మనోజ్ఞంగా నున్నది.

వరలక్ష్మి, రామగోపాల్ తమ పాత్రలను చక్కగా నిర్వహించారు.

ఈచిత్రపు డైరెక్టరు ప్రకాశరావుగారు. చిత్రనిర్మాతలగు ప్రకాశ్ ప్రొడక్షన్స్‌వారు యిట్టి ఉత్తమచిత్రాన్ని సమర్పించి నందుకు అభివందనీయులు.

సి. సి.

♦ ♦ ♦

బాలగంగాధర ప్రొడక్షన్స్‌కు మద్రాసు మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు ప్రారంభోత్సవము చేశారు. ఈసందర్భమున ప్రసిద్ధతార బి. జయమ్మ అధ్యక్షతవహించింది.

వీరు "గాంధీస్మృతి" అనేచిత్రాన్ని తీస్తారట. అందు నాగయ్య, ఘంటసాల, జయమ్మ, సూర్యకుమారిగారలు నటిస్తారట.

♦ ♦ ♦

భరణీ పిక్చర్సువారు తయారుచేస్తున్న "ప్రేమ" అనే చిత్రం యిప్పటికి దాదాపు సగంపూర్తి అయింది. దీనిని అత్యంత ఆకర్షణవంతంగా తయారుచేయుటకు దర్శకుడు రామకృష్ణగారు బహుశ్రద్ధతో కృషి చేస్తున్నారు. నవంబరు నెలలోగా యీ చిత్రము పూర్తికాగలదని తెలియుచున్నది. ఈ చిత్రము తెలుగు తమిళ భాషలలో తయారగుచున్నది.

---

# పేదయిల్లాలు:



మనోరమా దేవి.

కొడవలినొక్కచేత పసికూనను చంకన నెత్తిపైన కూ
డిడుకొని జీర్ణవస్త్ర విశదీకృత యాంగములెల్ల గందగా
దుడుకుగ యెండలోనఁ బతితో భుజియింపగ పోవుచున్న యో
పడతి! భవత్సతీత్వ మొక పాఠము జెప్పదె గొప్పవారికిన్!

చద్దిభుజింపకే పొలముచనని తదీయ విభుండు నాగటన్
ఎద్దులవిప్పి నీకొరక దేపనిగా తిలకించు చుండెనో
ముద్దియ గాంచుమా! యతనిమోమున నెత్తుటిబొట్టుగాన, మీ
ప్రొద్దుపవాస మంచుఁదలపోయడుగా యలవాటుచొప్పునన్!

లోకుల భాగ్యభోగములలో దనువెల్ల కృశింపజేయు మీ
కీ కడుపేదజీవిత మదేల ఘటిల్లెను పొట్టనిండుగా
నూకలులేనికాపురము నోచితిరా! మరి బ్రహ్మసృష్టిలో
నాకలిమంటచే నడచుయంత్రము లాభవదీయ కాయముల్!

సంకటి కారముం గుడిచి చల్లనినీడల విశ్రమించు మీ
చెంగట ముద్దుమాటలను జెప్పెడి కుర్రని మోము గాంచుచు
పొంగుచు సంబరంబొలకబోసెడి తీయని మాటలాడుకొం
చుం గనుమూయనున్న మిముజూడగ ముచ్చటగల్గకుండునే!

ప్రొద్దటువాలగా నిదురపూర్తియొనర్చి యథాప్రకారమా
యెద్దులఁబూన్చి దున్నుటకు నేగెడు నాథుని వీడుకొల్పి నీ
ముద్దుకుమారుతో వెడలిపోదువు గడ్డినిగోయ నాథుడుం
'వద్దులె' యన్న రాతిరికి 'పస్తని' నవ్వుమొగంబు జూపుచున్.

గడ్డిని విక్రయించిన దుకాణము చెంగట రాత్రి తిండికై
యడ్డెడురాగులాది యనువైనవి యెల్లను సేకరించి నీ
గడ్డికుటీర ప్రాంగణముఖంబున భర్తనిరీక్షణా క్రియన్
బిడ్డని బుజ్జగించి తినిపింతువు ముద్దలు ముద్దు ముద్దుగాన్.

విభుడేతెంచిన స్నానమాది క్రియలన్ వేవేగఁజేయించి మీ
రుభయుల్ భోజనమాచరించి మదిలో నుత్సాహమేపార మో
దభరానేక ప్రసంగులై మధురనిద్రం దేలరే యిట్టులే
శుభముంగూర్పుము రేపుగూడనని యీశున్ వేడి శుద్ధాత్ములై.

కుడువగకూడు కట్టుకొనగుడ్డయు పూర్తిగలేని కాపురం
బెడపక చేయుచుండెడి సతీత్వము నోర్పును నీదు భర్తయం
డడకువ ప్రేమయుం మదికి హాయినిగొల్పఁగ జీవితాంశమున్
గడిపెడు నిన్నుఁజేకొనిన కాంతుఁడు కష్టము లెక్కసేయునే!

కష్టసుఖములు రాత్రింబగళ్లు గాఁగ
పిడికెడన్నంపుటార్జన వృత్తిగలిగి
భక్తిప్రేమలు జీవితపథము దెలుప
జరుగు మీజీవితము కాలచక్రమట్లు.

——(o)——

# స్వాతంత్ర్య దినోత్సవము

మద్రాసు నగరంలోని వివిధవిద్యా సంస్థలతోబాటు కేసరి విద్యాలయములు కూడ అగష్టు 15వ తేదిన వైభవముగా స్వాతంత్ర్య దినోత్సవమును జరిపినవి.

మైలాపూరునందలి కేసరి హైస్కూలు విద్యార్థులు, త్యాగరాయ నగరునందలి కేసరి ప్రాథమిక పాఠశాల విద్యార్థులు నూతన వస్త్రాలంకరణతోబాటు జాతీయ జండాలను ధరించి ఉదయం హాజరయిరి.

కేసరి ప్రాథమిక పాఠశాలలో కార్యక్రమం దైవ ప్రార్థనతోటి, జాతీయ గీతాలతోటి ప్రారంభమయింది. అనంతరము కేసరి విద్యాలయముల కార్యదర్శిగారైన రావుబహదూరు బండి శ్రీహరిరావు నాయుడుగారు బాల బాలికలకు జాతీయ పతాకమును గురించి, దానివిశిష్టతను గురించి సరళమైన భాషలో చెప్పిరి.

ఈ విద్యాలయముల స్థాపకులగు శ్రీ కే.యస్. కేసరిగారు జాతీయపతాకమును ఎగరవేసిరి. అనంతరము శ్రీ కేసరిగారు బాల బాలికలకు తినుబండారములను పంచిపెట్టిరి.

కేసరి హైస్కూలునందలి ఉత్సవమునకు ఆంధ్రప్రభ సంపాదకులగు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించిరి. విద్యాలయ స్థాపకులగు శ్రీ కేసరిగారు, పాలకవర్గ సభ్యులు, పురప్రముఖులనేకులు ఉత్సవములో పాల్గొనిరి. ఉత్సవ కార్యక్రమం విద్యాలయ బాలికలప్రార్థనతో ప్రారంభమయ్యెను. ఈ సందర్భమున ఏర్పాటైన సమావేశములో హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకటరాజుగారు అధ్యక్షులను, జండా ప్రతిష్ఠాపకులుగా వచ్చిన శ్రీ వి. వి. శేషయ్యగారిని సభాసదుల కెరుకపరచి శ్రీ కేసరిగారి భాషాసేవాసక్తిని కొనియాడుచు ముఖ్యంగా మద్రాసు నగరంలోని తెలుగు బాల బాలికలకు విద్యాలయములను నెలకొల్పి, అందుకుగాను భూరివిరాళములనిచ్చి విద్యాసౌకర్యముల లేమినిబాపినందుకు కృతజ్ఞతను వెల్లడించిరి. అనంతరము శ్రీ వి. శ్రీనివాసశర్మగారు పంచరత్నముల చదివిరి.

అనంతరము శ్రీ వి. వి. శేషయ్యగారు జాతీయ పతాకము నెగురవేసిరి. పతాకవందనానంతరము శ్రీ శేషయ్యగారు శ్రీ కేసరిగారిని ఆదర్శంగా నుంచుకొని తెలుగునాటి శ్రీమంతులు యీవిద్యాలయముల నిర్వాహణకు, అభివృద్ధికి విశేషముగా విరాళములనిచ్చి తోడ్పడవలసినదిగా కోరుచు, విద్యాలయముల అభివృద్ధికి కొన్ని సూచనలిచ్చిరి. తల్లిదండ్రులు కూడ తమ బాల బాలికల విద్యావిషయంలో శ్రద్ధవహించవలసిన ఆవశ్యకతను వివరించిరి.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ఉపన్యసించుచు ఈవిద్యాలయముల స్థాపకులును, వాని యభివృద్ధికై నిరంతరము కృషిచేయుచున్న శ్రీ కేసరిగారి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిని కోరిరి. విద్యార్థులు జాతీయపతాకములను చొక్కాలకు అలంకరించుకోడంతో తృప్తిపడితే చాలదనియు, హృదయములలో శాశ్వతముగా స్థాపించుకొని యావద్భారత ప్రజానీకం ఏకోన్ముఖంగా జాతీయ పతాకఛాయ క్రిందనుండునట్టి ఉన్నత ఆశయ, ఆదర్శాలతో చక్కగా విద్యాభ్యాసము చేయవలెనని బాల బాలికల నుద్బోధించిరి.

బాల బాలికల జాతీయ గీతముల గానానంతరం శ్రీ యల్. జనార్దనశర్మగారి వందన సమర్పణతో ఉత్సవము ముగిసెను.

సి. సి. పున్నయ్య

—— (o) ——

# లోకవార్తలు

అభివృద్ధి ప్రణాళికల నమలుపరచుటకు క్రొత్త పన్నులు విధించబడుననియు, క్రొత్తఋణాలు చేయబడుననియు, ఎస్టేటు యీనాముల రద్దునుగురించి ప్రభుత్వము యోచిస్తున్నదని మద్రాసు శాసనసభలను ప్రారంభించుచు గవర్నరు తన ఉపన్యాసములో ప్రకటించారు.

◆ ◆ ◆

మద్రాసు శాసనసభలో శ్రీ తెన్నేటి విశ్వనాథం గారి నాయకత్వముక్రింద యునైటెడ్ డెమోక్రాటిక్ ఫ్రంటు అనబడే క్రొత్త పార్టీ స్థాపించబడింది.

◆ ◆ ◆

డిశంబరు నెలాఖరులోపల 27 లక్షల టన్నుల ఆహార ధాన్యములు అన్యదేశాలనుండి దిగుమతి చేయబడునని తెలియుచున్నది.

◆ ◆ ◆

ఇండియాలో పాక్ గూఢాచారిచర్యలను భారత పౌరులుకానివారు సాగిస్తున్నట్లు పశ్చిమ బెంగాలు సరిహద్దున బయటపడింది. దొంగతనముగా ఆయుధాలను ఎగుమతి చేయడానికి జరిగిన యత్నాలు కూడ కనిపెట్టబడి ఆయుధాలను ప్రభుత్వము స్వాధీనము చేసికొన్నది.

◆ ◆ ◆

లక్షరూపాయల కిమ్మత్తుకు తక్కువ కానట్టి ఎస్టేట్ల ఆస్థి సంక్రమించినవారు ఇండియా ప్రభుత్వానికి ఎస్టేటు సుంకము చెల్లించవలెనని విధిస్తూ ఇండియా ప్రభుత్వము ఒకచట్టమును శాసించదలచుకొన్నది. ఈయాస్థి స్థిరచరాస్తుల రూపంలో నుండవచ్చునట.

◆ ◆ ◆

ఆగష్టు 31 వ తేదీన బెజవాడలో అఖిలపక్ష సమావేశంలో విశాలాంధ్ర నిర్మాణానికి వీలుగా వెంటనే రాష్ట్రం ఏర్పడవలెనని తీర్మానంచేశారు.

◆ ◆ ◆

ఏరాజకీయ పార్టీని రేడియోద్వారా ఎన్నికల ప్రచారం చేసుకోనివ్వకూడదని భారత ప్రభుత్వం నిశ్చయించినట్లు బ్రాడ్కాస్టింగు శాఖమంత్రి శ్రీదివాకర్ గారు వెల్లడించారు.

◆ ◆ ◆

ఐక్యరాజ్య సమితి మానవహక్కుల ప్రణాళికము సాలుదాలో కంటె భారతదేశ రాజ్యాంగములోనే పౌర ప్రాతిపదిక హక్కులను కాపాడేందుకు ఎక్కువ కట్టుదిట్టాలు, రక్షణలు ఏర్పాటు చేయబడినవని జెనివా సభలో భారత ప్రతినిధి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు అన్నారు.

◆ ◆ ◆

విదేశాలకు రహస్యంగా రవాణా యగుతున్న 7 లక్షల కరెన్సీనోట్లను బొంబాయి సుంకపు అధికారులు పట్టుకొన్నారు.

◆ ◆ ◆

ఓటర్లను చేర్చడంలో వచ్చిన పొరబాట్లవల్ల వివిధ రాష్ట్రాలలో 28 లక్షలమంది స్త్రీలకు ఓటు అనేది లేకుండా పోయినందుకు మహిళా సంఘాల తరఫున ఒక ప్రతినిధి వర్గం శ్రీ సుకుమార సెన్ (ఎన్నికల కమీషనర్) కు తమ ఆక్షేపణను తెలిపారు.

◆ ◆ ◆

కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తుకు ప్రధాని షేక్ అబ్దుల్లా, ఉపప్రధాని బక్షీగులాం మహమద్,

జాతీయ పరిషత్తు ప్రధానకార్యదర్శి మౌలానా సయ్యదు పోటీలేకుండా ఎన్నుకోబడ్డారు.

♦ ♦ ♦

మద్రాసు శాసనసభలో ఆంధ్రులకున్న 145 స్థానాలకు, భారత యూనియన్ ప్రజాప్రతినిధుల కున్న 28 స్థానాలకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యాలయానికి 300 అభ్యర్థిత్వ దరఖాస్తులు చేరాయిట.

♦ ♦ ♦

స్వామి సీతారాం అక్టోబరు 2 వ తేదివరకు ప్రాయోపవేశంచేసి పిదప సత్యాగ్రహం చేస్తారట. త్వరలో స్వామి అనుచరులు దీక్షను త్వరలో విరమించగలరు.

♦ ♦ ♦

బందరు, దివి తాలూకాలో నియమవిరుద్ధంగా కుటుంబపోషణ కుంచుకొన్న ధాన్యమును సయితము అధికారులు ఊడ్చుకొని పోతున్నారని అలజడిగా నున్నది.

♦ ♦ ♦

ఉత్తరప్రదేశ శాసనసభలో బాల బాలికల శీల రక్షణచట్టం ఆమోదించబడింది. ఈ చట్టం ప్రకారం 16 సం॥ల వయస్సుకు లోపల ఉండే బాలికలను అవినీతి ప్రవర్తనకు పంపించినవారికి 2 సం॥లు ఖైదుశిక్ష, రు 1000 ల వరకు జరిమానా విధించబడునట.

♦ ♦ ♦

డివాలీలెండ్ కామెట్ అనేజెట్ విమానం 12 గం॥లలో లండనునుంచి ఢిల్లీ చేరింది. ఇట్టివిమానం ప్రపంచంలో మరొకటిలేదు.

♦ ♦ ♦

రాజస్థాన్‌లో యీమధ్యనే కలెక్టరు కొంత భూమిని రైతులపరంచేయగా సాగుచేసి పంటలు పండించుకొన్నారు. దానిని జాగీర్దార్ల ఏజంట్లు ట్రాక్టర్ల సహాయంతో నాశనంచేశారట. ఈ విషయము కలెక్టరుకు తెలియజేయబడింది.

♦ ♦ ♦

ఆగష్టు 19 వ తేదిన మద్రాసుమంత్రి శ్రీమాధవ మీనన్‌గారి భార్య శ్రీమతి కుట్టి అమ్మాళ్‌గారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి షష్టిపూర్తి విశ్రాంతి భవనం విశాఖపట్నంలో ప్రారంభోత్సవముచేశారు. ఇదివిశ్వకళా పరిషత్తులోని 70 మంది విద్యార్థినులకు వసతి గృహముగా నుంటుంది.

♦ ♦ ♦

సెప్టంబరు 8 తేదిన ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశంలో టాండన్ స్థానే కాంగ్రెస్ అధ్యక్షపదవికి పండితనెహ్రూ ఎన్నుకోబడెను.

♦ ♦ ♦

విదేశాలలో సైనిక స్థావరాలను నెలకొల్పడానికి అమెరికా 598 కోట్ల డాలర్లు వెచ్చించడానికి సెనేట్ ఆమోదించింది.

♦ ♦ ♦

మద్రాసు వాసులు, రేషను ప్రాంతములో నున్నవారు, మిగులు జిల్లాలలోనున్నవారి స్నేహితులైన భూస్వాములవద్దనుండి తల 1 కి రోజుకు 6 ఔన్సుల చొప్పున ఒకేసారి 6 నెలలకు సరిపడే రేషన్లు తెప్పించుకోడానికి భారతప్రభుత్వం అనుమతించింది. ఈ విషయమును గురించి మద్రాసు ప్రభుత్వం త్వరలో ఉత్తరువు జారీచేస్తుంది.

నేడే చూడండి!

ఆంధ్రదేశమున కొక సరిక్రొత్త చిత్రము!

నూతన వాతావరణము
నూతన సంప్రదాయము
నూతన నటీనటులు

కె. & కె. ప్రొడక్షన్సు & తిరుమలై పిక్చర్సు వారి

# జీవితనౌక

తెలుగు

కేరళ ప్రాంతములకు చెందిన
ఒక రసవత్తర సాంఘిక చిత్రము...





ఆంధ్రదేశమున ముఖ్యకేంద్రములలో త్వరలో విడుదల కానున్నది!

*Released through* **THE VAUHINI PICTURES LTD.,**

MADRAS....VIJAYAWADA....GUNTAKAL

# “భారతనీతి”

“భరత దేశాన వినుమా భరతవీరు
లలయ సాధించి రితరుల నాహవమున
వారిచరితంబు విననెంతొ వాచినటుల
ఊరుచున్నవి నాచెవులూరికేను.”
అనుచు నా శివాజి యొక నాడంధకార
సమయ సామీప్య కాంతార సరసులోన
సలిలమొక పురుషుడు ద్రాగు సమయమందు
“అమ్మరో”యని దవ్వున యరుపు వినెను.
‘అబల యేడ్చినట్టులయ్యె నడవిలోన
నేకతంబిట్లు శోకింప నేకతంబొ’
యనుచు వేగాన యాదిక్కు నడుగులిడుచు
కొంత దవ్వునగాంచె నక్కానలోన
“రమ్మ! మా వెంటపలుకక రమణి”యనుచు
ధూర్తులేవురు కత్తులం దూసి మూగ
‘నయమెనను మీతొ రమ్మన నయమె’యనుచు
మతిచలింప వాపోయెడు మగువనొకతె!!
అరుణకాంతులు వెలిగెడు యాస్యుడగుచు
“నీచులార! మీ హైందవనీతిమఱచి
పర రమణిగూడ నాసక్తి బరగు మీకు
నిదియె భూశాంతిగూర్చెద నింపుమీర”
యని శివాజి భూనాయకుడపుడు వేగ
నిశిత కరవాలధారల నీచమతుల
నేల పడవేయ బోరగ నేతగాంచి
పడెను ధూర్తుల గుండెల బండరాయి!
అయ్యె నంతయు చిటికెలో! యపుడు వేగ
పందలందరు భయమున బఱుగులిడిరి.
మోకరిలి, యతనిపదాల మోమువంచె
వలపుజూపుల బఱపుచు నలతియంత.
“ఎవరిబిడ్డవీవు? ఎచటికేగుదాన?
నామధేయమెద్దొ! యొకింత నాతిచెపుమ!”
యనగననియె నామె యాదనుజూచి
“‘చాంద్‌బీబి’ యని బఱగుదాననయ్య!
రాజశేఖర, ముస్లిము రమణినయ్య!
ఒంటి కొలని నీరాన కేనొంటిబోవ
నీచులేవురు ననుబట్టి నీతిమఱచి
‘మగువ! మా వెంట నడువుము మాటలేక’
యనగనెంతయు భయమున వరచితేను”
అని యొక తడవాగి మగుడియనియె నిటుల
“మానరక్షక! వినుము నామానసమున,
ఏమొవలపుగొంటి నినునాపలుకలేక!
అన్యసంపర్కమెరుగని కన్యనేను!
చేరవలచితి చక్కన చేయబోకు!
కొమ్మనను మార్పలుకక యంకమ్మునందు”
అంచు బల్మరు వేడగ నామెజూచి
“వలదు నామీద నీరీతి వలపుగొనగ!
నేను హిందువుడ! గన్నెలదేరిమాడ
నెరుగవే భరతదేశీయు డేకసతుడు!
పట్టువ్రతము విడలేను; ఎట్టులమ్మ
నిన్ను చేపట్ట భారతనీతిదప్ప?
పొమ్ము వలపేల నామీద పొలతినీకు?
మానరక్షణావ్రతము నే మాననమ్మ!
కాని, దానిఫలాన నేగాంతగోర!
పొమ్ము చెల్లెల నీదగు పురమునకును”
అను నతని ధర్మవాక్యాల నామెవినక
“వలపుకాడ! ఇటుబలుకవలదు, వలదు!
భగ్నమానిసిజేయగ భవ్యమగునె?
కోరివలచిన నామీద గోపమేల?
సోలి, సుందర! రతికేళి దేలియాడ
కేలిబంధాలనిచ్చలు కేళిసేయ
రమ్ముహాయిగ రమియింప రమ్మురమ్ము.”
అనుచు నాతని దరిబోవ “నయ్యొ
ఎట్టిపలుకులు విననయ్యె పట్టిముఖత!
శివశివా!” యంచు నెంతయు శిరమువంచి
కేలుదమ్ములు ముకుళించి కేశినికపు
డెనిమిదంగాలు భువిమోపి, ఏకరీతి
“తల్లి నినుజేకొన మరినాతరముగాదు
పొమ్ము నీమార్గమునఁనిక పొలతినీవు”
యనుచు వెనుదిరుగక తనయశ్వమెక్కి
ఎటకొ పటుతరవేగాన నేగుచుండె.

మిస్. లలితారావ్.

—(:o:)—



మాజీ తిరువాన్‌కూరు దివాన్ శ్రీ సి. పి. రామస్వామి అయ్యరుగారు మద్రాసులో నొకబహిరంగ సభలో నిట్లుపన్యసించిరి.

ఇండియాకు విదేశాల ప్రమాదమున్నట్లయితే దానిని ఎదుర్కొని నిర్మూలించాలి. అట్టిప్రమాదమును తుడిచివేయగల శక్తిమంతుడు మన ప్రధానమంత్రి పండితనెహ్రూ ఒక్కడే. ఆయనే గాంధీజీకి తగిన వారసుడు.

పండితనెహ్రూ ఢిల్లీకాంగ్రెస్ సంఘ యాజమాన్యమున జరిగిన బహిరంగ సభలో నిట్లు పన్యసించిరి.

కాంగ్రెస్ కార్యకర్తలకు రెండునాలుకలుండటం తగదు; ఒకటిచెప్పి మరొకటి చేయడం అన్నది కాంగ్రెస్ సేవకులలో యీనాడు పరిపాటి అయిపోయింది. ఈ చెడుగును ప్రతిఘటించి ప్రతిహతం చేయవలసిన బాధ్యత ప్రజలమీద నున్నది.

♦ ♦ ♦

ఆసియాలో యీమధ్య పర్యటనచేసివెళ్లిన అమెరికా సుప్రీముకోర్టు న్యాయమూర్తి విలియమ్ డగ్లస్ పత్రికా విలేఖరులతో యిలా అన్నారు.

అమెరికా ప్రభుత్వము నవచైనానుగుర్తించి ప్రపంచమంతటా ప్రజాస్వామ్యాన్ని బలపరచేందుకు ప్రస్తుతం రష్యాచైనాలకు కలుగుతున్న కలతలను సాధనోపాయంగా వినియోగించుకోవాలి.

♦ ♦ ♦

శాసన సభలో రాష్ట్ర ఆహారపరిస్థితిపై చర్చ సందర్భములో బేగం అమిరుద్దీన్ గారు యిలా ఉపన్యసించారు.

నాల్గు సంవత్సరములనుండి దేశంలోనున్న అన్నవస్త్రాలకరువు చూస్తే కాంగ్రెస్ పాలన దుఃఖకరమైనదిగా వేరే చెప్ప నవసరములేదు. రాష్ట్ర ఆహారమంత్రి సంపన్నుడైనందున విలాసజీవితములో దరిద్రులైన సామాన్యప్రజల కష్టాలు కనలేకున్నారు.

♦ ♦ ♦

శ్రీ దేవిప్రసాద్‌రాయ్ చౌదరిగారు కుటీర పరిశ్రమలగూర్చి పరిశీలనసందర్భములో యిట్లు సూచించారు.

మన ప్రాచీన కళాకౌశలాన్ని చాటేకుటీర పరిశ్రమలనుగూర్చి యావద్భారతదేశం మొత్తముమీద సర్వేచేసి సమగ్రమైన విజ్ఞాన సర్వస్వం ప్రకటించడం అత్యంతావసరం.

—o—




**మిణుగురుపురుగు:** రచయిత శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు, 14 న్యూస్ట్రీటు, మైలాపూరు, మద్రాసు-4. వెల 6 అణాలు.

బాలబాలికల విద్యాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడగల వాటిలో చిన్న చిన్న పాటలు కూడ ప్రముఖపాత్ర వహిస్తవి. చిన్నప్పటినుండి వివిధవిషయాలను చిన్న చిన్న పాటలు, పద్యాలమూలంగా సులభముగా బోధించవచ్చును. అటువంటి పాటలే యీ చిన్న పుస్తకములో నున్నవి.

శ్రీ కామేశ్వరరావుగారు ఏ పుస్తకము వ్రాసినను ఉన్నతాశయములతో నిర్వహిస్తారు. అలాగే యీ పుస్తకమును కూడ బాల బాలికలకు విజ్ఞానాభివృద్ధి కుపకరించు లాగున చిన్న చిన్న పాటలతో పొందుపరచారు. పాటలు సున్నితంగాను, హృద్యంగాను, సులభశైలిలో నున్నవి.

బాలబాలికల విద్యావిధానమును గురించి పరిశ్రమ చేయు పెద్దల మన్ననల నీ గ్రంథము నొందగలదని మా విశ్వాసం. శ్రీ కామేశ్వరరావుగారి కృషి ప్రశంశాపాత్రము.

**అల్లాడ్దీన్:-** కల్పన, రచన, నిర్వహణ శ్రీ బుజ్జాయి, ప్రకాశకులు, బుజ్జాయి పబ్లికేషన్స్, 38 హాబిబుల్లా రోడ్డు, మద్రాసు-17. వెల 6 అణాలు.

ఇది బొమ్మల కథపుస్తకం. ఇటువంటి పుస్తకములు ప్రాథమిక విద్యావ్యాప్తికి చాల ఉపయోగపడుతవి. బాల బాలికలు యిట్టి పుస్తకములను అమితోత్సాహంతో చదివి విజ్ఞానాభివృద్ధి గావించుకొంటారు. చక్కని బొమ్మలతోటి, పెద్ద అక్షరములతోటియుండే ఆకర్షణవంతమైన పుస్తకములు ప్రాథమిక విద్యార్థుల కుపకరించేవి చాలతక్కువ అనే చెప్పాలి. ఈ సందర్భంలో బాల బాలికలకు యీ చిన్న పుస్తకమును ప్రసాదించినందుకు రచయిత అభినందనీయుడు.

**పిల్లల మొల్లతాడు:** రచన కరుణాకుమార్. ప్రచురణ ఆధునిక వాఙ్మయకుటీరం, **22** దివాన్ రామయ్యంగారురోడ్డు, పురశైవాకం, మద్రాసు 7, వెల రూపాయి.

ఇది చక్కని నవల. గ్రామీణజీవితాన్ని కథావస్తువుగా గ్రహించి రాత్రింబగళ్లు కష్టించే వారి కష్టసుఖాలను మనోహరంగా రచించాడు. చివరకు మానవుని యోగ్యతను నిర్ణయించేది గుణమే కాని అస్తిపాస్తులు కావని యిందులో చిత్రించబడినవి.

ఈ నవల ఉత్తమశ్రేణికి చెందినది.

———(o)———

స్త్రీ హితైషిణిమండలి (బాపట్ల) 1950-51 యిరువదవ వార్షిక నివేదిక మా కార్యాలయము చేరినది.

ఈ నివేదికనుబట్టి మండలివారి మహిళాభ్యుదయ కార్యక్రమము అభినందనీయము. మండలివారు సభలు, సమావేశములతోబాటు చికిత్సాలయము, వ్యాయామక్రీడలు, నాట్యసంగీత తరగతులు మొదలగు వానిని నిర్వహించుచున్నారు.

ఆదాయ వ్యయముల పట్టికనుచూడ మండలి సభ్యురాండ్ర చందాలమీదనే ఆధారపడుచున్నట్లు కనుపించుచున్నది. అయినను శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు తమసమర్థతతో కార్యదర్శినిగా యీ మండలిని నిర్వహించుచుండుట పేర్కొనతగిన విషయము.

మహిళా ఉద్యమమునం దాసక్తికలవారు విరాళములిచ్చి యీ మండలి అభివృద్ధికి తోడ్పడగలరని నమ్ముచున్నాము.

—(0)—

# విజ్ఞప్తి

శ్రీత్యాగరాజస్వామి జన్మస్థలమగు తిరువాయూరు గ్రామమున గానకళాసుందరి, గానకళా విశారద బెంగుళూరు నాగరత్నమ్మగారు తమ సర్వస్వమును ఆలయనిర్మాణమునకు ఏటేటా జరుగుచున్న ఉత్సవాలకు వెచ్చించుచున్న విషయం అందరికి తెలిసినదే.

భక్తులు, గాయకులు నిత్యము ఆమెతో సహకరిస్తున్నారు. అట్టివారిలో యీమధ్య రు 1000లు విరాళ మిచ్చిన వారు, మద్రాసు నివాసి, కాలక్షేపములు చేయుటలో ప్రసిద్ధికెక్కిన శ్రీమతి పద్మాసనిబాయి ఒకరు.

ఇప్పటికే ఆలయ ఆవరణలో అతిథులకు, భక్తులకు నివాసయోగ్యంగా నాలుగు కుటీరములు నిర్మించబడినవి. ఇంకా పనిపూర్తియగుటకు రు 6000 లు కావలసియున్నది. దాతలు ఉదార హృదయంతో విరాళములను శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు, తిరువాయూరు, తంజావూరుజిల్లా చిరునామాకుపంపి నాగరత్నమ్మగారి కృషికి సహకరించవలసినదిగా విజ్ఞప్తిచేయుచున్నాము.

ఇట్లు
సంపాదకుడు

# సంపాదకీయములు

## వినాయక చతుర్థి

ఇది హిందువులకు గొప్పపర్వదినం. వినాయకుని జన్మవృత్తాంతము, విఘ్నేశ్వరుని పూజయొక్క ప్రాధాన్యం అందరికి తెలిసిందే. ప్రతి శుభకార్యాలకు విఘ్నేశ్వర పూజ మొట్టమొదట జరుపడం మనకు సాంప్రదాయం. మన హిందూ సమాజంలో ప్రతియొక్క పర్వదినమును విశాలదృష్టితో నిర్ణయించబడినది. అట్టిదే వినాయక చతుర్థి కూడాను. వినాయకుని పూజించుటవలన ఈప్సితార్థములు నెరవేరి పుణ్యము సమకూరడమే కాదు; వానితోబాటు యింకా ఉన్నత ఉద్దేశాలున్నవి.

వినాయక చతుర్థినాడు యథావిధిగా పూజసల్పడానికి ఎంత ఓపిక, శ్రద్ధ, శ్రమ అవసరమో చూడండి. వివిధ రకాలపండ్లు, పత్రి, పూలు, పిండివంటలు సమకూర్చుకోడానికి కాస్తకూస్త శ్రమ చాలదు. భక్తిశ్రద్ధలనేవి కూడ ఒక కారణంగా యిట్టిపూజాకలాపాలను ఏర్పరచి మనదైనిక జీవితంలో ఓర్పు, శ్రమలకు అలవాటుపడునట్టి ఉన్నత ఆదర్శాలను బోధించారు మనపెద్దలు.

అంతేకాదు పదార్థ విజ్ఞానాభివృద్ధికికూడ యీపూజా కలాపాలు ఉపకరిస్తవి. వివిధ రకాల పత్రి, ఫలాలు కూడ యిట్టిపర్వదినాలలో సమకూర్చుకోడం వలన వానిని గురించి తెలిసికో కలుగుతాము.

పూర్వము టీపార్టీలు, డిన్నరులు వుండేవికావు. కాబట్టి యిట్టిపర్వదినములను అవకాశముగా విని యోగించుకొని పర్వదినానికి తగినట్లు వివిధ భక్ష్యభోజ్యములను బంధు మిత్ర పరివారముతో ఆరగిస్తారు. అంటే విఘ్నేశ్వరుని పూజవలన పుణ్యం పురుషార్థము రెండును ఉన్నవని మా మనవి.

## పండిత నెహ్రూకు జై!

పండిత నెహ్రూ భారత ప్రధాన మంత్రేకాదు; మరొక్కసారి యీనాడు ఆలిండియా కాంగ్రెస్‌కు అధ్యక్షుడైనాడు.

ఈ నాలుగు సంవత్సరములనుండి కాంగ్రెస్ సంస్థలో క్రమంగా అరాజకం ప్రబలిపోయింది. కాంగ్రెస్ వాదులలో అధిక సంఖ్యాకులు బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్నారు. ఇందుకు మూలంగా కాంగ్రెస్ ప్రభుత్వాలు, సంస్థ కూడ ప్రజలకు దూరమై పోతుండేది.

దీనికి నెహ్రూ కూడ బాధ్యుడనే పైకి అనిపిస్తుంది. కాని ప్రధానమంత్రిగా దేశాన్ని ఎదు ర్కొంటున్న జాతీయ అంతర్జాతీయ వివిధ సమస్యల నెదుర్కొనే కార్యభారంవలన కాంగ్రెస్ సంస్థను పున రుద్ధరించలేక ఆభారాన్ని తన సహచరులకు వదలిపెట్టాడు. దాని నిర్వహణ లోపమే యీనాటి పరిస్థితులకు కారణము. ఈనాటి టాండన్ నెహ్రూ వివాదములు వ్యక్తిగతమైనవి కావు. ప్రస్తుతపు కాంగ్రెస్ సంస్థ యొక్క దీనావస్థనుచూచి సహించలేక దానిని పునరుద్ధరించడానికి నెహ్రూ అధ్యక్షపదవి స్వీకరించక తప్పిందికాదు, యావద్భారతదేశం దానినే హర్షిస్తున్నది.

కాంగ్రెస్ పట్ల అసంతృప్తితో దానిని వదలి వెళ్లినవారు యీసందర్భంలో కాంగ్రెస్‌లో మరల చేరి యీజాతీయ సంస్థను బలపర్చి దేశాభివృద్ధికి నెహ్రూతో సహకరించాలి.

పండిత నెహ్రూను బలపరుస్తూ, కాంగ్రెస్ ఆశయాలనే త్రికరణశుద్ధిగా నమ్మి పరచుటకని ప్రత్యేక పార్టీలను స్థాపించినవారు మరల కాంగ్రెస్‌లో ప్రవేశించి పనిచెయ్యాలి.

పండిత నెహ్రూ నాయకత్వంక్రింద కాంగ్రెస్ సంస్థలోని అరాజకం చక్కబడి ప్రజలలోని అసం తృప్తి, అశాంతు లంతరించి, దేశానికి కాంగ్రెస్ నాయకత్వం వహించగలదు. ప్రజలు నూతనోత్సా హంతో హృదయపూర్వకంగా నెహ్రూతో సహకరించగలరని మావిశ్వాసం.

## శ్రీ ఖరనామ సం॥ర భాద్రపద ఆశ్వయుజ మాసములు.

| | | | |
|---|---|---|---|
| సెప్టెంబరు నెల | 16 | ఆ | బ. పాడ్యమి 26-48 ఉభా ది 15-45 మహాలయపక్షారంభం |
| | 17 | సో | వి 25-27 రే 52-37 ది 22-3 |
| | 18 | మం | త 25-26 అశ్వ 54-42 రా 14-3 (ఉండ్రాళ్లతద్ది) |
| | 19 | బు | చ 26-32 భ 57-56 ది 20-0 భరణిమహాలయ |
| | 20 | గు | పం 28-55 కృ 60-10 ది 29-56 చంద్రషష్ఠీవ్రతం |
| | 21 | శు | ష 32-0 కృ 2-1 రా 15-1 కపిలషష్ఠీవ్రతం |
| | 22 | శ | స 35-58 రో 7-10 ది 22.29 |
| | 23 | ఆ | అ 40-30 మృ 12-50 మధ్యాష్టమి, రుద్రాష్టమీవ్రతం |
| | 24 | సో | న 44-52 ఆ 18-46 రా 21-41 |
| | 25 | మం | ద 49-26 పున 24-44 రా 16-36 |
| | 26 | బు | ఏ 57-32 పుష్య 30-25 త్యాజ్యాభావః, సర్వోపవాసః |
| | 27 | గు | ద్వా 57-4 ఆశ్రే 35-39 ది 5-12 యతీనాం మహాలయా |
| | 28 | శు | త్ర 59-51 మఘ ది 7-5 |
| | 29 | శ | చతు 60 10 పూఫ 43-23 ది 1-14 మాసశివరాత్రి, అనధ్యయనత్రయం |
| | 30 | ఆ | చతు 1-40. ఉఫ ది 2-16 మహాలయామావాస్య |
| 1951 సం॥ | 1 | సో | ● అమా 2-10. హ 47-11 ది 7-23. అమావాస్య సోమవారవ్రతం. శరన్నవరాత్రారంభం, కలశస్థాపన. |
| | | | **ఆశ్వయుజమాసం** |
| | 2 | మం | శు. పాడ్యమి 1-26 ఏప్యా 57-38 చి 47-7 ది. 7-10 చంద్రోదయం స్తన్యవృద్ధి గౌరీవ్రతము |
| అక్టోబరు నెల | 3 | బు | త 55-56 స్వా 45-55 వై 20-50 ది 0-50 రా 29 40 మొహారం |
| | 4 | గు | చ 51-39 విశా 47-39 వ 23-47 రా 23-20 హస్తంరవిః |
| | 5 | శు | పం 46-31 అనూ. 40-29 రా 27.36 త్యా 3-44 |
| | 6 | శ | ష 40-47 జ్యే 36-34 రా 25-31 త్యా 3-43 |
| | 7 | ఆ | స 34-28 మూ. 32-13 ది 28-30 భానుసప్తమి, సరస్వతిపూజ |
| | 8 | సో | అ 25 4 పూషా 27-36 రా 15-34 అష్టమితిథిః కాళికాష్టమీ దుర్గాష్టమి |
| | 9 | మం | న 21-42 ఉషా. 22-7 రా 2-56 తిథిద్వయం. మహానవమి |
| | 10 | బు | ద 15-36. శ్రీ 18-59 ది 28-27 విజయదశమి |
| | 11 | గు | ఏ 10-8 ధ 15-24 రా 3-10 త్యా 3.49 ఏకాదశి గురువారవ్రతం |
| | 12 | శు | ద్వా 5-24 శత 12 37 ది 28-10 పద్మనాభ ద్వాదశి |
| | 13 | శ | త్ర 1 43 ఏప్యా 57-51 త్యా 3.58. అనధ్యయనత్రయం |
| | 14 | ఆ | ○ పూ 58-22 ఉభా 10-19 రా 11-21 |
| | 15 | సో | బ. పాడ్యమి. రే 10-58. త్యాజ్యాభావః. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# కేసరి రత్నత్రయము

## లోధ్ర

### గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అమృత

### రక్తశుద్ధి ద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునొయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అర్కా

### సర్వజ్వర నివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికీటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

## కేసరి కుటీరం లిమిటెడ్

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజాముకు, ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

